Scholars's Edition

శ్రీరస్తు

శ్రీనాథకవి ప్రణీతము

# శృంగారనైషధము

ఉత్పల వేంకటనరసింహాచార్యపరిష్కృతము



చెన్నపురి:
వావిళ్ల రామస్వామిశాస్త్రులుఅండ్సన్సు వారిచేఁ
బ్రకటితము
1951

# పీఠిక

## శ్రీనాథుఁడు

ఆంధ్రవాఙ్మయమునఁ దిక్కనతరువాత నింతపండితుఁడు మఱొకఁడులేఁడు. తిక్కనవలెనే యాతఁడును గురుపీఠమలంకరించిన మహామూర్తి. సోమయాజివలెనే యాకవిసార్వభౌముఁడును రాజభోగములన్నిటిని ననుభవించిన పుణ్యశాలి. ఇతఁడు తనసమకాలముననేగాక మొన్నమొన్నటివఱకును గూడ, నీభాషపయిఁ దనప్రభావము నెఱపిన శక్తిమంతుఁడు; విపులకావ్యేతిహాసములనుండి యాంధ్రరసికులదృష్టిని బ్రబంధములవైపు మరలించిన రసికావతంసుఁడు.

శ్రీనాథునిఁగూర్చి యెఱిఁగినంతపూర్ణముగ మనకితరకవులఁ గూర్చి తెలియదు. శ్రీనాథుఁడు చిన్నతనముననే సమస్తవేదవేదాంగపాండిత్యమును సంపాదించెను; సాంఖ్యాదిసిద్ధాంతములను, శైవవైష్ణవాగమములను, పాతంజలాదియోగసూత్రములను, న్యాయవైశేషికాదిదర్శనములను గబళించెను. ఈసమస్తవిద్యాపరిశ్రమ మాతనిగ్రంథములయందుఁ గానవచ్చును. సంస్కృతకవిప్రపంచమునఁ గాళిదాసభారవిమురారిశ్రీహర్షు లతనికి గురుస్థానము. ఆంధ్రకవులందుఁ గవిత్రయమువారియెడను భీమకవియెడను నీతనిది కేవలము శిష్యభావము. (చూ. వచియింతు వేములవాడభీమనభంగీత్యాది.) పాల్కురికి సోమనయెడసైతమీతనికి గౌరవములేకపోలేదు. ఏలన నితఁడతని ద్విపదకావ్యమైన పండితారాధ్యచరిత్రమును బద్యకావ్యముగ సంతరించి మామిడిప్రెగ్గడయ్యకుఁ గృతి నొసంగెను. సోమనాథునికావ్యమును గేవలము చదివి పరి వర్తనమొనర్చుటయేగాక తఱచుగా నందలిద్విపదలనే తనపద్యముల నెక్కించె నని పిడుపర్తిసోమన వచించియున్నవాఁడు.

కాశీఖండమున వేమభూపాలుఁడు త న్నుద్దేశించి చెప్పినట్టు లీతఁడురచించిన "ఈక్షోణిని నినుఁ బోలుసత్కవులు లేరీనాఁటికాలంబునన్." అనుపద్యార్థమెంతేని నిజము. అట్టికవి యానాఁడు లేఁడు. శ్రీనాథుఁడు కొండవీటిరాజులలోఁ బెదకోమటియాస్థానకవి. అంతేగాదు. తత్ సంస్థానవిద్యాశాఖాధికారిగసహిత ముండెను. వేమారెడ్డియాస్థానమున దిగ్దంతివంటి సంస్కృతకవి వామనభట్టబాణుఁడను వాఁడొకఁడుండెను. ఇతఁడు విద్యారణ్యులవారిశిష్యుడు. వామనభట్టబాణుఁడు సంస్కృతమున వ్రాసిన గ్రంథములలో నలాభ్యుదయ మొకటి. అది నలునిచరిత్రలోఁ బూర్వభాగము. ఈరచనయే శ్రీనాథుని హర్షనైషధాంధ్రీకరణమునకుఁ బ్రేరకమయియుండును. మైత్రికి భంగమురానివిద్యాస్పర్ధచే శ్రీనాథుఁడాకృతిఁ దలపెట్టియుండును. ఇది క్రీ. శ 1415 ప్రాంతమున రచియింపఁబడియుండునని యూహ.

"చిన్నారిపొన్నారి చిఱుతకూఁకటినాఁడు రచియించితి మరుత్తరాట్చరిత్ర" ఇత్యాదిపద్యములవల్ల శ్రీనాథుఁడు బహుగ్రంథకర్తయని స్పష్టమగుచున్నది; కాని వాన నుపలభ్యమానములు నైషధము (1415), హరవిలాసము (1425), భీమఖండము (1430), కాశీఖండము (1445), శివరాత్రిమాహాత్మ్యము, క్రీడాభిరామము (వీథినాటకము), పల్నాటివీరచరిత్రము నను గ్రంథములే.

## శృంగారనైషధము

సంస్కృతవాఙ్మయమాంధ్రపరివర్తనముఁ బొందినచరిత్రములో మూఁడవస్థాభేదములు

గలవు. మొదటిది కవిత్రయమువారు ప్రారంభించిన పురాణేతిహాసపరివర్తనపద్ధతి. నామమాత్రమున నివి పరివర్తనములు, గాని మూలకథ నాధారముగాఁ గొని వారు గావించిన స్వతంత్రరచనలు మూలముతోపాటు సమానకార్యములుగ నొప్పినవి. కొన్నిఘట్టములందు వారు మూలమునకు వన్నెచిన్నెలు దిద్దిరి. కావ్యకళాదృష్టిచే మూలమును దాఱుమాఱు చేసిరి. ఈస్వతంత్రపద్ధతి మొదటిది. ఈ చరిత్రలోని రెండవయవస్థకు నైషధము తార్కాణము. ఇందు మూలానుసరణము తప్పలేదు. ముక్కకు ముక్కగాఁ దెలిఁగింపను లేదు. అనఁగా మూలవిధేయతయు స్వతంత్రతయు నను రెండుగుణములును గలిసినసంధి. ఈప్రక్రియకు నైషధమే మొదలు. మూఁడవపద్ధతి సంస్కృతనాటకములకు నేఁటితెలుఁగుసేఁత. ఇందు భాషాంతరీకర్తలు కేవలము మూలమునకు దాసులయిరి.

నైషధము సంస్కృతమున నెంతమహాకావ్యమైనను దత్కర్తయగు శ్రీహర్షుఁడు కాళిదాసాదులతోఁ బోల్పఁదగిన కవికాఁడు. అతఁడు మహాపండితుఁడు, శబ్దార్థకల్పనాచాతురి గలవాఁడు. కాళిదాసభవభూతులకు లభించిన యుదాత్తకవితాతత్త్వ మీతనికి లేదు. శ్రీహర్షనైషధమును లోకము కొనియాడుట యిందలి పాండితీవిలసనమునకును గల్పనాచాతురికిని. ఈగ్రంథమున ననౌచిత్యదోషము దొరలినతావులును గలవు. స్త్రీవిషయమున నెట్టివర్ణనలనైనను జేయుటకు వెను దీయని శ్రీనాథుఁడు సైత మిందలి యనౌచిత్యములఁ జూచి కంటగించుకొనెను. బుద్ధిపూర్వకముగ వానిని బరిహరించితి నని తానే చెప్పుకొనెను. చూడుఁడు హర్షుని నలగుణవర్ణనము:-

శ్లో. సాపీశ్వరే శృణ్వతి తద్గుణౌఘాన్ ప్రహస్య చేతో హరతోఽర్ధశంభుః,
అభూదవర్ణాంగులిరుద్ధకర్ణా కదానకండూయనకైతవేన.

శ్లో. అలంసజన్ ధర్మవిధే విధాతా రుణద్ధి మౌనస్యమిషేణ వాణీం,
తత్కంఠమాలింగ్య రసన్య తృప్తాం న వేద తాం వేదజడః సవక్రాం.

శ్లో. శ్రియస్తదాలింగనభూర్నభూతా వ్రతక్షతః కాపి పతివ్రతాయాః,
సమస్తభూతాత్మతయా నభూతం తద్భర్తురీర్ష్యాకలుషాణునాపి.

పైశ్లోకములలో రంభాద్యప్సరోభామినులేగాక త్రిమూర్తులభార్యలుసైతము నలునిగుణములను విని చాపలము వహించిరని యాతఁడు సూచించినాఁడు. జగన్మాతలకీదోషము నంటఁగట్టుట మిక్కిలియనుచిత మని దానిని బరిహరించి రంభావిషయమునుమాత్రము తా నిట్టులు తెలిఁగించెను.

శ్లో. అస్మత్కిలశ్రోత్రసుధాం విధాయ రంభాచిరంభామతులాం నలస్య,
తత్రానురక్తా తమనాప్య భేజే తన్నామగంధాన్నలకూబరం సా.

చం. వినుకలి ......... వాసనన్".

హంస దమయంతియొద్ద నలుని వర్ణించునపుడు

శ్లో. సువర్ణశైలా.......... కీర్త్యై

అనుశ్లోకములోని "స్మరకేళికాలే" యనునసందర్భపదప్రయోగమును శ్రీనాథుఁడు పరిహరించుట లెస్స. అతని తెనుఁగిది.

గీ. కనకశైలంబు డిగ్గి .........వైశాఖ వేళలందు.

ఇచ్చట "వైశాఖవేళ" యన్న దెంతసందర్భశుద్ధిగలదో రసికు లరయుదురుగదా?

ఔచిత్యసంపాదనముకై చేసినమార్పుల నటుండనిచ్చి మొత్తముమీఁద భాషాంతరీకరణపద్ధతిఁ జూచినచో శ్రీనాథుఁ డన్నట్లు నిజముగా నిది "భావం బుపలక్షించియు, రసంబు పోషించియు, నలంకారంబు భూషించియు, నౌచిత్యంబాపాదించియు, ననౌచిత్యంబు పరిహరించియు మాతృ కానుసారంబునఁ" జెప్పఁబడినదేయని స్పష్టమగును. ఇట "భావం బుపలక్షించి" యనఁగా మూలకారునియభిప్రాయము గుఱుతించి యనియర్థము చెప్పవలసియుండును. కొన్ని చోట్ల నాతనియాశయములు స్పష్టముగా లేనప్పుడు ఆంధ్రకవి వానిని చక్కగా నుపలక్షించి స్పష్టపఱిచినాఁడు.

శ్లో. విధిం నధూస్పృష్టిమపృచ్ఛమేవ తద్యానయుగ్యో నలకేళియోగ్యాం,
త్వన్నామవర్ణా ఇవ కర్ణసీతా మయాస్య సంక్రీడతి చక్రచక్రే.

చ. అడిగితినొక్కనాఁడు కమలాసనుతేరికి వాహనంబనై
నడుచుచు నుర్విలో నిషధనాథునకెవ్వతెయొక్కొ భార్య య
య్యెడు నని చక్రఘోషమున నించుక యించుకగాని యంత యే
ర్పడ వినవైతి నీ వనుచుఁ బల్కినచందము దోఁచె మాలినీ.

ఎంత మూలము ననుసరించినను మూలమునకు నితఁడు వన్నె పెట్టుట మానలేదు.

సీ. నలినసంభవు సాహిణము వారువంబులు కులముసాములు మాకుఁగువలయాక్షి
చదలేటిబంగారు జలరుహంబులతూండ్లు భోజనంబులు మాకుఁబువ్వుఁబోఁడి
సత్యలోకముదాఁక సకలలోకంబులు నాటపట్టులు మాకు నబ్జవదన
మధురాక్షరములైనమామాటలువినంగ నమృతాంధసులె యోగ్యులనుపమాంగి

గీ. భారతీదేవి ముంజేతిపలుకుఁజిలుక, సమదగజయాన సబ్రహ్మచారి మాకు
వేదశాస్త్రపురాణాది విద్యలెల్లఁ, దరుణి నీయాన ఘంటాపథమ్ము మాకు.

అను సుప్రసిద్ధపద్యము మూలార్థమునకుఁ బ్రత్యాదేశము చేయుచున్నది.

కేవలము మూలానుసార మని తెలుపుటకుఁ గొన్నిచోటుల మూలమునందలిపదములనే పద్యమున నెక్కించవలెనని యితఁడుచేసినప్రయత్నము స్వతంత్రతాలక్షణముగాఁ దోఁచుటలేదు. అది మూలాభిమానమునకు లక్షణము. ఆ సంస్కృతపదముల నవలంబించుటలోఁ దత్ప్రయోగము ఆంధ్రభాషావిరుద్ధమనియైన నాతఁడు దలఁప లేదు.

శ్లో. సరసీః పరిశీలితుం మయా గమికర్మీకృతనైకనీవృతా
అతిథిత్వమనాయి సా దృశోః సదసత్సంశయగోచరోదరీ.

పై శ్లోకమునందలి "గమికర్మీకృతనైకనీవృతా, సవసత్సంశయగోచరోదరీ" అనెడు రెండపూర్వశబ్దకల్పనముగల ఒక్క భావమునే రెండుపద్యములలో జెప్పినాడు.

మ. కమలేందీవరషండమండితలసత్కాసారసేవారతిన్

గమికర్మీకృతనైకనీవృతుఁడనై కంటిన్ విదర్భంబునన్
రమణిం బల్లవపాణిఁ బద్మనయనన్, రాకేందుబింబాననన్
సమపీనస్తని నస్తి నాస్తివిచికిత్సాహేతుశాతోదరిన్.

మ. మృదురీతిం బ్రతివాసరంబు గమికర్మీభూతనానానదీ
నదకాంతారపురీశిలోచ్చయుఁడనై నైకాద్భుతశ్రీజిత
త్రిదివంబైన విదర్భదేశమున నారీరత్నముం గాంచితిన్
సదసత్సంశయగోచరోదరి శరత్సంపూర్ణచంద్రాననన్.

మూలములోని

శ్లో. అస్తివామ్యభరమస్తి కౌతుకం సాస్తి ఘర్మజలమస్తి వేపథు,
అస్తి భీతిరతమస్తి వాంఛితం ప్రాపదస్తి సుఖమస్తి పీడనమ్.

అనుశ్లోకమునందలి "అస్తివామ్యభరా"ది సమాసములు. వ్యాకరణసాధ్యములును, వైయాకరణమనోరంజకములును, అంతేగాని పూర్వకవిప్రయోగార్హములు కావు. అయ్యును బండితుఁడయిన శ్రీహర్షుఁడు బ్రయోగించుటచేఁ దానును బ్రయోగింపకుండుట పరిహాసహేతువగునేమో యనిజంకి శ్రీనాథుఁడు వానిని యథాస్థితముగా నిట్లు వాఁడుకొనెను.

గీ. అస్తివామ్యభారమస్తికౌతూహల, మస్తిఘర్మసలిల మస్తికంప
మస్తిభీతి యస్తిహర్ష మస్తివ్యథం, బస్తవాంఛమయ్యెనపుడు రతము.

ఈయెత్తుగీతి పైనున్ననాలుగుసీసపాదములును శ్రీనాథునికల్పనమే. ఈరీతి యాసీసమునకెంతేని వన్నె పెట్టుచున్నది. సీసపద్యపు ఆనాలుగుపాదము లివి.

సీ. పతిపాణిపల్లవచ్యుతనీవిబంధనవ్యగ్రబాలాహస్తవనరుహంబు
ధవకృతాధరబింబదశనక్షతవ్యథాభుగ్నలీలావతీభ్రూలతంబు
ధరణినాయకభుజాపరిరంభమండలీగాఢపీడితవధూఘనకుచంబు
వరనఖాంకుర మృదువ్యాపారపులకిత నీరజాక్షీనితంబోరుయుగళి

గీ. అస్తివామ్యభార ..........

మూలశబ్దానుసరణము పరమావధిని బొందిన దనుటకుఁ బయి నుదాహరించిన శ్లోకములతోఁ బాటు దీనినిగూడఁ బేర్కొనఁదగును.

శ్లో. అశ్రాంతశ్రుతిపాఠపూతరసనావిర్భూతభూరిశ్రవా,
జిహ్మబ్రహ్మముఖౌఘవిఘ్నితనవస్వర్గక్రియాకేళినా...

అనుటకు

శా. వేదాభ్యాసవిశేషపూతరసనావిర్భూతభూరిశ్రవా
సాదబ్రహ్మముఖౌఘవిఘ్నితనవస్వర్గక్రియాకేళిచే.

నన్నది తెలుఁగుసేఁతయఁట.

ఇక నీగ్రంథముఁ గూర్చి యొకటిరెండుమాటలు. ఇది లోకులనుకొనునట్లు

హర్షనైషధమునకు డుమువులు చేర్చిన యాంధ్రగ్రంథముకాదు. శ్రీనాథునిశ్లోకములలో మూలశ్లోకము లిమిడినట్లుగాఁ గనఁబడునుగాని మూలశ్లోకములలో నాతఁడిమిడినట్టు లగపడదు. చమత్కారార్థము గమికర్మీకృతాదులగు నొండురెండుశ్లోకముల తెనుఁగుసేఁతను జూచిమోపిన యాలోకనిందలో నేమాత్రమును సత్యము లేదు. మిక్కిలి ప్రౌఢసాహిత్యముగల సంస్కృతనైషధము నటుంచి శ్రీనాథుని కృతినే చదివితిమేని మూలాపేక్షలేకయే సర్వమును విశదమగును. ఇదియే దానిమూలసమప్రాధాన్యమును విశదము సేయును.

ఈకావ్యమునఁ గవితాశిల్పము చక్కగాఁ బ్రదర్శితమైనపట్టు నలదౌత్యఘట్టము. హంసదూత్యము దానితరువాతిది. అందు మొదటిదానిలో నాయికానాయకులకు జరగిన ప్రౌఢసంభాషణాక్రమము, కవికిఁగల లోకజ్ఞతకును నౌచితీపరిపాలనకును సాక్ష్యముగా నున్నది. హంసదూత్యము పింగళిసూరన శుచిముఖీదూత్యమునకు నొరవడిగా నున్నది.

## శ్రీనాథునిశైలి

నన్నయ సంకల్పించి నాచనసోముఁడు కొంతవఱకుఁ గొనసాఁగించిన శయ్యాసౌభాగ్యము శ్రీనాథునివలనఁ బరిణతిఁ జెందినది. ప్రబంధకవులకును, బురాణేతిహాసకర్తలకునుగల ప్రధానమైనవాసి యీశయ్యయందే గలదు. తిక్కనాదు లర్థము నారాధించిరి గాని శయ్యను గాదు. ప్రబంధకవులు శయ్యాసంపాదనార్థమై శబ్దము నారాధించిరి. అర్థమును గౌణము చేసిరి. వారికి నీత్రోవచూపినవాఁడు శ్రీనాథుఁడు కాని, శ్రీనాథునివిషయమున మాత్రము క్వాచిత్కముగాఁ దక్క నర్థమును శబ్దమునుగూడఁ బ్రధానములే. ఇతనిశయ్యలో జిగిబిగులు రెండును గలవు. ఇతనివాక్కు మిక్కిలి భావభరితము కావుననే యితనిశైలి యుద్ధండముగా నుండును.

శ్రీనాథునిజీవితచరిత్ర వ్రాయుటనఁగా బదునేనవశతాబ్ది యాంధ్రదేశచరిత్రవ్రాయుట యని శ్రీచిలుకూరి వీరభద్రరావుగారొకచో వచించియున్నారు. ఆకాలమున నుచ్చస్థితిలో నున్న యాంధ్రకర్ణాటకరాజ్యములతో నతనికిఁగలసంబంధము, నానామంత్రులతో నతనికిఁగలమైత్రి నానాదిశల నాతఁడొనర్చిన సంచారము - ఇత్యాదు లతని నాంధ్రలోకైకకవిగాఁ జేసినవి.

ఇఁక మిగిలినదొక్కటి. చంద్రునకు నూలుపోగన్నట్టులు శ్రీనాథమహాకవిచక్రవర్తిఁగూర్చి రెండువాక్యములు వ్రాయ నాకవకాశమిప్పించిన శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రుల వారికి మిక్కిలి కృతజ్ఞుఁడను.

టీచర్స్‌కాలేజి, సైదాపేట, మద్రాసు
ఇట్లు,

వృష, ఆషాఢ శు 5.
గ. శ్రీ. న. ఆచార్య

## విషయసూచిక

### ప్రథమాశ్వాసము


ఇష్టదేవతాప్రార్థనాదికము
ఆదికవిస్తుతి
కృతిపతిప్రశంస
కృతిపతివంశావతారవర్ణనము
షష్ఠ్యంకములు
నలమహారాజవర్ణనము
దమయంతి నలునియం దనురక్త యగుట
నలుండు దమయంతియం దనురక్తుఁ డగుట
నలుని యుద్యానవనవిహారము
నలుడు హంసముం బట్టుకొనుట
ఆశ్వాసాంతము


### ద్వితీయాశ్వాసము


హంస నలునిచే విడువఁబడి కృతజ్ఞతఁ జూపుట
హంస నలునికడ దమయంతి నభివర్ణించుట
హంస దమయంతికడకు దూతయై చనుట
కుండిననగరవర్ణనము
రాజహంస దూత్యము
దమయంతి నలునిఁ దక్క నన్యుని వరియించ ననుట
హంస దమయంతి వీడ్కొని నలునకు దూత్యసిద్ధిం దెల్పుట
హంస నలుని వీడ్కొని సత్యలోకంబున కేగుట
దమయంతీవిరహవర్ణనము
చంద్రదూషణము
మన్మథదూషణము
సఖులు దమయంతికి శిశిరోపచారములు సేయుట
దమయంతీ స్వయంవరప్రకటనము
ఆశ్వాసాంతములు


### తృతీయాశ్వాసము

నారదపర్వతు లింద్రునికడ కేతెంచుట
నారదుఁ డింద్రునకు దమయంతీస్వయంవరము దెల్పుట
ఇంద్రాదులు దమయంతీస్వయంవరమునకుం దరలుట
ఇంద్రాదులు నలుం గాంచుట
ఇంద్రాదులు దమయంతికడకు నలుని దూతఁగా బంపుట
నలుండు రాయబారియై దమయంతికడ కేఁగుట
దమయంతికడ కింద్రాదులదూతికలు వచ్చుట
నలుఁడు దమయంతీసౌందర్యమును వర్ణించుట
ఆశ్వాసాంతము

## చతుర్థాశ్వాసము

నలుని రాయబారము
నలుఁడు దమయంతికిఁ దననామాదుల నెఱిఁగించుట
దూత్యము నెఱవేరమికి నలుఁడు చింతిల్లుట
దమయంతిమాఱుగాఁ జెలియ నలునితో ముచ్చటించుట
నలదమయంతులు చింతిల్లుట
నలదమయంతులకడకు హంస వచ్చుట
హంస సాంత్వనవాక్యములఁ బలుకుట
నలుని మనశ్శుద్ధి
నలునిమనశ్శుద్ధికి దేవతలు సంతోషించుట
స్వయంవరాగతవర్ణనము
భీమరాజు సరస్వతీదేవిం బ్రార్థించుట
సరస్వతీసాక్షాత్కారము
ఆశ్వాసాంతము

## పంచమాశ్వాసము

దమయంతి స్వయంవరాస్థానమున కేతెంచుట
రాజులు దమయంతిసౌందర్యమున కచ్చెరు వందుట
సరస్వతి దమయంతికి వరణీయుల వర్ణించుట
దేవతలు
వాసుకి
పుష్కరద్వీపాధిపతి

శాకద్వీపాధిపతి
క్రౌంచద్వీపాధిపతి
కుశద్వీపాధిపతి
శాల్మలిద్వీపాధిపతి
ప్లక్షద్వీపాధిపతి
జంబూద్వీపరాజులు
ఉజ్జయినీపతి
గౌడరాజు
మథురాధిపతి
కాశీరాజు
అయోధ్యాధిపతి
పాండ్యరాజు
కాళింగుఁడు
నేపాళరాజు
కామరూపాధిపతి
ఉత్కలదేశరాజు
కీకటుఁడు
పంచనళి
దమయంతి నలుని దెలిసికొనుట
ఆశ్వాసాంతము

## షష్ఠాశ్వాసము

నలమహారాజవరణము
ఇంద్రాదులు నలదమయంతులకు వరంబు లిచ్చుట
సరస్వతి నలునకుఁ జింతామణిమంత్రం బుపదేశించుట
నలుఁడు విడిది కేగుట
దమయంతీకళ్యాణనేపథ్యము
నలునికల్యాణనేపథ్యము
నలుఁడు కల్యాణమంటపంబున కేతెంచుట
నలదమయంతీపరిణయము
బువ్వపుబంతి
ఆశ్వాసాంతము

## సప్తమాశ్వాసము

నలుఁడు దమయంతీసహితుఁడై నిజరాజధాని కేఁగుట
నలదమయంతుల పురప్రవేశము
ఇంద్రాదులు స్వర్గమునకు మరలుట
ఇంద్రాదులకు మన్మథుఁ డెదురుపడుట
క్రోధుఁ డెదురుపడుట
లోభుఁ డెదురుపడుట
మోహుఁ డెదురుపడుట
కలియెదురుపడుట
నిషధదేశంబునఁ గలిపురుషుని దుర్వర్తనము
నలదమయంతీగృహప్రవేశము
విహారసౌధవర్ణనము
నలదమయంతులవిహారము
ఆశ్వాసాంతము

## అష్టమాశ్వాసము

ప్రాభాతవైతాళికగీతములు
నలుఁడు ప్రాతఃకాలకృత్యంబులం దీర్చుట
నలదమయంతుల గోష్ఠి
మాధ్యాహ్నికము
శివపూజ
హరిపూజ
హరిస్తుతి
భగవద్దశావతారవర్ణనము
సంగీతాదిగోష్ఠి
సాయంసంధ్యావర్ణనము
నక్షత్రవర్ణనము
అంధకారవర్ణనము
చంద్రవర్ణనము
ప్రబంధోపసంహారము
ఆశ్వాసాంతము

శ్రీరస్తు

# శృంగారనైషధము

## ప్రథమాశ్వాసము

### ఇష్టదేవతాప్రార్థనాదికము

శ్రీరామాకుచమండలీమృగమదశ్రీగంధసంవాసిత
స్ఫారోదారభుజాంతరుండు ధరణీసంశ్లేషసంభావనా
పారీణుండు కృతార్థుఁ జేయుఁ గరుణాపాథోధి పద్మాక్షుఁ డిం
పారన్ మామిడిపెద్దమంత్రిసుతు సింగామాత్యచూడామణిన్. ॥1॥

మ. [1]*కనకక్షోణిధరంబు కార్ముకముగాఁ గద్రూతనూజుండు శిం
జినిగా మాధవుఁ డమ్ముగాఁ బురము లక్షీణైకదోశ్శక్తి గె
ల్చిన జోదీశ్వరుఁ డిచ్చుఁ గాత జయలక్ష్మీసుస్థిరైశ్వర్యశో
భనముల్ పెద్దయసింగమం త్రికి జగత్ప్రఖ్యాతసత్కీర్తికిన్. ॥2॥

ఉ.* హాటకగర్భుచేతఁ గమలాసనుచేఁ జతురాస్యకంఠశృం
గాటకవీథికాకృతవిగాహచతుశ్శ్రుతిచేత దేవతా
కోటికిరీటసంఘటితకోమలపాదసరోజుచే జగ
న్నాటకసూత్రుచేతఁ గృతినాథుడు గాంచుఁ జిరాయురున్నతుల్. ॥3॥

శా. జే జే యంచు భజింతు నిష్టఫలసంసిద్ధుల్ మదిం గోరి ని
ర్వ్యాజప్రౌఢకృపావలంబునిఁ గటప్రస్యందిదానాంబునిం
బూజాతత్పరదేవదానవకదంబున్ బాలకేళీకళా
రాజత్కౌతుకరంజితోరగపతిప్రాలంబు హేరంబునిన్. ॥4॥

సీ. సింహాసనము చారుసితపుండరీకంబు
చెలికత్తె జిలువారుపలుకుఁజిలుక
శృంగారకుసుమంబు చిన్నిచుక్కలరాజు
పసిఁడికిన్నెరవీణ పలుకుఁదోడు
నలువనెమ్మొముఁదమ్ములు కేళిగృహములు
తళుకుటద్దంబు సత్కవులమనసు
వేదాదివిద్యలు విహరణస్థలములు
చక్కనిరాయంచ యెక్కిరింత
తే. యెపుడు నేదేవి కాదేవి యిందుకుంద
చంద్రచందనమందారసారవర్ణ
శారదాదేవి మామకస్వాంతవీథి
నిండువేడుక విహరించుచుండుఁ గాత. ॥5॥

వ. అని యిష్టదేవతాప్రార్థనంబు చేసి. ||6||

## ఆదికవిస్తుతి

సీ. వ్యాసవాల్మీకిసంయమివాక్సుధాంభోధి
లోలోర్మిపంక్తుల నోలలాడి
భట్టబాణమయూరభారతీసందర్భ
సౌభాగ్యగరిమంబు సంగ్రహించి
భాససౌమిల్లిక ప్రతిభాసమున్మేష
హేలావిశేషంబు నిచ్చగించి
మాఘభావవివచోమకరందనిష్యంద
మాధుర్యమునకు సమ్మదము నొంది
తే. కాళిదాసు మనంబులోఁ గాంచి మ్రొక్కి
రాజశేఖరుఁ గవిరాజు బ్రస్తుతించి
ధీరమతి నన్నపార్యునిఁ దిక్కయజ్వ
శంభుదాసునిఁ గర మర్థి సన్నుతించి. ||7||

వ. నవరసభావానుబంధబంధురంబుగా నొక్క ప్రబంధంబు నిర్మింప దలంచి కౌతూహలాధీనమానసుండ నై తన్మహాప్రబంధప్రారంభంబునకుం దగినపుణ్యశ్లోకపురాతనమహారాజచరిత్రం బెయ్యది యొకో యని వితర్కించుచున్న సమయంబున. ||8||

## కృతిపతిప్రశంస

సీ. తనకృపాణము సముద్ధతవైరిశుద్ధాంత
తాటంకముల కెగ్గుఁ దలఁచుచుండఁ
దనబాహుపీఠంబు ధరణిభృత్కమఠాహి
సామజంబులకు విశ్రాంతి యొసఁగఁ
దనకీర్తినర్తకి ఘనతరబ్రహ్మాండ
భవనభూముల గొండ్లిఁ బరిఢవిల్లఁ
దనదానమహిను సంతానచింతారత్న
జీమూతసురభుల సిగ్గుపఱుప
తే. బరఁగు శ్రీవేమమండలేశ్వరునిమంత్రి
యహితదుర్మంత్రివదనముద్రావతార
శాసనుఁడు రాయవేశ్యాభుజంగబిరుద
మంత్రి పెద్దయసింగనామాత్యవరుడు. ||9||

శా. పంచాంగ స్థిరమంత్రరక్షణకళాప్రౌఢుండు బాలామనః
పాంచాలుండు విరించివంశజలధిప్రాలేయభానుండు దో
శ్చంచచ్చాపకృపాణలబ్ధవిజయైశ్వర్యుండు దిక్కామినీ
కాంచీమౌక్తికకీర్తి పెద్దవిభుసింగం డొక్కనాఁ డిమ్ములన్. ||10||

వ. మృదుమధురచిత్రవిస్తరకవితావిలాసవాగీశ్వరు లగుకవీశ్వరులును, పతంజలికణాదాక్షచరణపక్షిలాదిశాస్త్రసిద్ధాంతకమలవనహంసు లగు విద్వాంసులును, భరతమతంగదత్తిలకోహలాంజనేయప్రణీత

సంగీతవిద్యారహస్యవిజ్ఞానవైజ్ఞానికస్వాంతు లగుకళావంతులును, శక్తిత్రయచతురుపాయషాడ్గుణ్యప్రయోగయోగ్యవిచార లగురాయబారులును, నిఖిలపురాణేతిహాససంహితాతాత్పర్యపర్యాలోచనాధురంధరధిషణాసముత్సాహం బగు పౌరాణికసమూహంబును, బరివేష్టింపం గొలువుండి, సకలవిద్యాపారీణుండు సరససాహిత్యగోష్ఠీవినోదప్రసంగంబున. ||11||

శా.* భారద్వాజపవిత్రగోత్రుని శుభాపస్తంబసత్సూత్రు వి
ద్యారాజీవభవుండు మారయకుఁ బుణ్యాచారభీమాంబకు
న్గారామైనతనూజ న న్ననఘు శ్రీనాథాఖ్యునిం బిల్చి స
త్కారం బొప్పఁగ గారవించి పలికెన్ గంభీరవాక్ప్రౌఢిమన్. ||12||

శా. బ్రాహ్మీదత్తవరప్రసాదుఁడ వురుప్రజ్ఞావిశేషోదయా
జిహ్మస్వాంతుఁడ వీశ్వరార్చనకళాశీలుండ వభ్యర్హిత
బ్రహ్మాండాదిమహాపురాణచయతాత్పర్యస్థనిర్ధారిత
బ్రహ్మజ్ఞానకళానిధానమవు నీభాగ్యంబు సామాన్యమే! ||13||

క. జగము నుతింపఁగఁ జెప్పితి
ప్రెగడయ్యకు నాయనుంగుఁ బెద్దనకుఁ గృతుల్
నిగమార్థసారసంగ్రహ
మగునాయారాధ్యచరిత మాదిగఁ బెక్కుల్. ||14||

వ. కావున నాకు నొక్కప్రబంధంబు పుణ్యశ్లోకపురాతనరాజర్షిచరితానుబంధబంధురంబుగా రచియింపు మందును. ||15||

సీ. కవిరాజరాజిశేఖరహీనముకుటంబు
శ్రీహీరకలశాబ్ధిశిశిరకరుడు
మామల్లదేవీకుమారరత్నంబు చిం
తామణిమంత్రచింతనఫలంబు
కవికులాదృష్టాధ్వగమనాధ్వనీనుండు
కాశ్మీరనృపసభాకమలహేళి
ఖండనగ్రంథసంగ్రంథకర్కశబుద్ధి
షట్కర్మధర్మైకచక్రవర్తి
తే. భట్టహర్షుండు ప్రౌఢవాక్పాటవమున
నెద్ది రచియించె బుధలోకహితముపొంటె
నట్టినైషధసత్కావ్య మాంధ్రభాష
ననఘ యొసరింపు నాపేర నంకితముగ. ||16||

చ. పనిపడి నారికేళఫలపాకమునం జవి యైనభట్టహ
ర్షునికవితాసుగుంభములు సోమరిపోతులు కొంద ఱయ్య లౌ
నని కొనియాడ నేర రది యట్టిద; లేజవరాలు చెక్కు గీఁ
టిన వస వల్చుబాలకుఁడు డెందమునం గలఁగంగ నేర్చునే? ||17||

వ. అని పలికి సబహుమానంబుగాఁ గర్పూరతాంబూలం బొసంగి జంబూనదాంబరాభరణంబులు గట్టి నిచ్చి వీడ్కొలిపిన; నేను నమ్మహాప్రధానునిం గృతినాయకుం జేసి నైషధకావ్యంబు దొడంగితిఁ దత్ప్రారంభంబునకు

మంగళాచారంబుగాఁ దదీయవంశావతారం బభివర్ణించెద. ॥18॥

## కృతిపతివంశావతారవర్ణనము

శా. తోరం బైనతపోవిశేషమున సద్యోజాతవక్త్రంబున
స్గౌరీవల్లభుచేత దీక్షఁ గొనియె స్సప్తర్షులం దొక్కఁడై
తారావీథి నలంకరించెఁ, గనియెం ద్రయ్యర్థసంఘాతమున్,
భారద్వాజమహామునీంద్రుఁ దగదే భక్తిం బ్రశంసింబపఁగన్. ॥19॥

ఉ. ఆమునినాథునన్వయమునం దుదయించెఁ బయఃపయోనిధిన్
యామవతీకళత్రుం డుదయం బయినట్లుగఁ గల్పవృక్షచిం
తామణి కామధేనుసమదాననిరూఢుఁడు విద్విషత్తమ
స్సో మదివాకరుండు పెదతూర్కనమంత్రి కులాగ్రగణ్యుఁడై. ॥20॥

వ. తత్సంతానక్రమంబున. ॥21॥

మ. కుటిలారాతివరూథినీధవశిరఃకుట్టాకధాటీషహా
పటహధ్వానవిపాట్యమానదశదిగ్భాగుండు త్రైలోక్యసం
పుటపేటీపరిపూర్ణకీ ర్తిమయకర్పూరప్రకాండుండు శ్రీ
చిటిపెద్దప్రభుఁ డొప్పె విక్రమపురీసింహాసనాధ్యాసియై. ॥22॥

క. ఆచిటిపెద్దప్రభునకు
వాచస్పతిసదృశనీతివైభవలక్ష్మీ
వైచిత్రి కధికవిమలశి
వాచారఘనుండు మామిడన్న జనించెన్. ॥23॥

ఉ. స్వామిహితంబునన్, సమదశాత్రవభంజనశక్తి, బంధుర
క్షామహనీయసంపద, వసంతసమాగమఫుల్లమల్లికా
స్తోమతుషారపాండురయశోగరిమంబున, ధర్మశీలతన్,
మామిడిమంత్రిఁ బోల మఱి మంత్రులు లేరు వసుంధరాస్థలిన్. ॥24॥

తే. అతనియర్ధాంగలక్ష్మి యక్కాంబ గనియె
నాత్మజుల వేదమూర్తుల నబ్ధినిభుల
వెలయ శ్రీపెద్దనామాత్య వీరభద్ర
మారనప్రభు నామన మంత్రివరుల. ॥25॥

సీ. అనవద్యహృద్యవిద్యాబుద్ధిసంసిద్ధి
బిసరుహాసనుసుద్ది పెద్దవిభుఁడు
భగ్ననిర్నిద్రవాఙ్ముద్రాసముద్వృత్తిఁ
గద్రూభవుఁడు వీరభద్రమంత్రి
మేరుభూధరసారధీరతాగుణహారి
వైరిశైలబలారి మారశౌరి
స్వామిభక్తిహితైకభావవైభవభూమి
భామినీరతిరాజు నామరాజు
తే. మామిడీశ్వరసాగరామరకుజంబు
లక్కమాంబికాశుక్తిరత్నాంకురములు

వంశపావను లర్థార్థివాంఛితార్థ
దానశౌండులు సౌభ్రాత్రధర్మపరులు. ॥26॥

మ.* అనతారాతివసుంధరారమణసప్తాంగాపహారక్రియా
ఘనసంరంభవిజృంభమాణపటుదోఃఖర్జూద్వితీయార్జునుం
డనవేమాధిపు రాజ్యభారభరణవ్యాపారదక్షుండు పె
ద్దనమన్త్రీశుఁడు మామిడన్నసుతుఁ డేతన్మాత్రుఁడే చెప్పఁగాన్. ॥27॥

ఉ. హేమధరాధరేంద్రమున కెక్కటిపెద్దధృతిన్ భుజంగమ
స్వామికి మేలుచేయి పటువాగ్విభవంబున బుద్ధిసంపదం
దామరచూలికి న్సరి ప్రధానులు దక్కినవారు సాటియే
మామిడివీరభద్రున కమాత్యశిఖామణి కివ్వసుంధరన్? ॥28॥

ఉ. సత్యవచోనిరూఢుఁడు నిశాకరశేఖరభక్తిభావనా
సాత్యవతేయుఁ డుద్భటభుజాబలవిక్రమకేళి విక్రమా
దిత్యుఁడు కార్యఖడ్గసముదీర్ణుఁడు మామిడిమంత్రి మారనా
మాత్యుఁడు వానిఁ బోల వశమా ధరణీధవమంత్రికోటికిన్? ॥29॥

శా. స్వామిద్రోహరగండలాంఛనునకున్ సంగ్రామగాండీవికిన్
వేమక్ష్మాపతికార్యభారకలనావిఖ్యాతధీశక్తికిన్
నామామాత్యున కన్యరాజనిటలాంతర్న్యస్తభాగ్యాక్షర
స్తోమాపాకరణప్రవీణునకు మంత్రు ల్సాటియే యెవ్వరున్? ॥30॥

ఉ. తమ్ములు దన్ను ముప్వురును దైవముఁగా గురుఁగా మహానిధా
నమ్ముగ దాతఁగాఁ దమమనంబుల భావన సేసి కొల్వ భా
గ్యముల కెల్ల నెల్ల యయి కాంచెఁ బ్రసిద్ధి నృపప్రధానర
త్నమ్మగుమంత్రి పెద్దన యుదాత్తమతిన్ రఘురాముకైవడిన్. ॥31॥

సీ. గౌతమగోత్రవిఖ్యాతుఁ డాపస్తంబ
పరమసంయమిసూత్రపావనుండు
గారాపుఁబౌత్త్రుండు గంధవారణుఁ డగు
శ్రీ తనామాత్యశేఖరునకు
పేషణిహనుమంతబిరుదాంకు లగు రాచ
వారికి నెయ్యంపువరసుతుండు
చౌహత్తమల్లుండు దోహత్తనారాయ
ణుండు ఖండియరాయచండబిరుద
తే. మంత్రియల్లాడరాజును మహితపుణ్య
యన్నమాంబయుఁ దనకు నత్యంతగరిమఁ
దల్లియును దండ్రియును గాఁగఁ దనరునట్టి
తల్లమాంబికాదేవి నుద్వాహమయ్యె. ॥32॥

మ. వనితారత్నము తల్లమాంబికకు శ్రీవత్సాంకతుల్యుండు పె
ద్దనకుం బుట్టిరి నందనుల్ విమలవిద్యాభారతీవల్లభుల్
వినతాసూనుసమానవిక్రమనిధుల్ వీరుండు వేమాహ్వయుం
డును శ్రీప్రెగ్గడదండనాథతిలకుండున్ సింగనామాత్యుఁడున్. ॥33॥

వ. అందగ్రజుండు. ||34||

సీ. కాలకంఠ కఠోలకంఠహుంకారంబు
చెవులు సోఁకనినాఁటిచిత్తభవుఁడు
కుపితరాఘవఘనక్రూరనారాచంబు
తనువు నాఁటనినాఁటివనధిరాజు
క్రుద్ధకుంభోద్భవభ్రూలతాకౌటిల్య
వికృతిఁ గ్రుంగనినాఁటివింధ్యశిఖరి
వీరభద్రోదారఘోరవీరావేశ
విహతిఁ గందనినాఁటితుహినకరుఁడు
తే. చక్కఁదనమున గాంభీర్యసారమునను
బ్రకటధైర్యకళాకలాపములయందు
దండనాయకచూడావతంస మైన
మంత్రిమామిడివేమనామాత్యుఁ డెలమి. ||35||

మ. తగుఁ గైవార మొనర్ప విక్రమకళాధౌరేయతాశాలి శ్రీ
ప్రెగడన్నధ్వజినీశుఁ డంబునిధిగంభీరుండు శుంభద్ద్విష
న్నగరద్వారకవాటపాటనవిధానప్రౌఢబాహార్గళా
యుగళుం డాహవసవ్యసాచి ధరలోనొక్కండు వేరుక్కునన్. ||36||

సీ. గగనకల్లోలినీకల్లోలమాలికా
హల్లీసకములతో నవఘళించి
చరమసంధ్యాకాలసంఫుల్లమల్లికా
స్తబకషంక్తులతోడ సరస మాడి
శరదాగమారంభసంపూర్ణపూర్ణిమా
విమలచంద్రికలతో వియ్యమంది
బిసరుహాసనవధూపృథుపయోధరభార
హారవల్లరులతో ననఁగి పెనఁగి
తే. వెలయు నెవ్వానియభిరామవిమలకీర్తి
యతఁడు త్రిభువనరాయవేశ్యాభుజంగ
కదనగాండీవిజగనొబ్బగండబిరుద
శాశ్వతుం డొప్పు సింగన సచివవరుఁడు. ||37||

మ. అరుదార న్వివిధాగ్రహారములతో నాందోళికాచ్ఛత్త్రచా
మరకల్యాణకళాచికాదిబహుసమ్మానార్హచిహ్నంబు లా
దర మొప్పారఁగ వేమభూవరునిచేతం గాంచె సామ్రాజ్యసం
భరణప్రౌఢుఁ డమాత్యసింగఁడు నయప్రాగల్భ్యగర్వోన్నతిన్. ||38||

వ. ఈదృగ్విధగుణాలంకారుఁ డైనయమ్మహాప్రధానశేఖరునకు. ||39||

## షష్ఠ్యంకములు

క. శ్రీమంతున కావర్జిత
సామంతున కహితహృదయజలజాతవనీ
హేమంతునకును సలలిత

భామాకంతునకు సచివభాస్వంతునకున్. ||40||

క. కుకురు కురు చోళ కేరళ
శక మరు కర్ణాట లాట సౌవీర నృప
ప్రకరసభాభగణమహో
సుకవిజనానీకవినుతశుభచరితునకున్. ||41||

క. చెంచిమలచూడకారున, కంచితకరుణాతరంగితాపాంగునకున్
జంచలనయనాకలకిల, కించితలీలావిలాసకేళీరతికిన్. ||42||

క. హాటకగిరిధీరున కరి, తాటంకవతీకపోలతలకరిమకరీ
పాటచ్చరకఠినధను, ర్జ్యాటంకారునకు మన్మథాకారునకున్. ||43||

క. శ్రీమహితు పెట్టసుతునకు, వేమక్షితిపాలరాజ్యవిభవకళార
క్షామణికి సింగసచివ, గ్రామణికిం బాండ్యరాజగజకేసరికిన్. ||44||

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన యిమ్మహాప్రబంధంబునకుం గథానాయకుండు. ||45||

కథా ప్రారంభము

## నలమహారాజవర్ణనము

సీ. తపనీయదండైకధవళాతపత్త్రితో
ద్దండతేజఃకీర్తిమండలుడు
నిర్మలనిజకథానిమిషకల్లోలినీ
క్షాళితాఖలజగత్కల్మషుండు
వితతనవద్వయద్వీపనానాజయ
శ్రీవధూటీసమాశ్లిష్టభుజుఁడు
నిఖిలవిద్యానయావృత్తరంగస్థలా
ఽఽయతనాయమానజిహ్వాస్థలుండు
తే. ప్రస్తుతింపంగఁ దగుసముద్భటకఠోర
చటులగుణటంక్రియాఘనస్తనితఘోష
చాపనీరదభవశరాసారశమిత
బలవదహితతేజోదవానలుఁడు నలుఁడు. ||46||

చ. అలయకధీతిబోధములు నాచరణంబు ప్రచారణంబు గాఁ
గలుగునుపాధిభేదముల గాఢమతి న్నిగమాదు లైనవి
ద్యలు పదునాలుగింటికి నతం డొనరించెఁ జతుర్దశత్వముం;
దెలియఁగ లేము కారణము దీనికి నెమ్మెయిఁ జర్చ చేసినన్. ||47||

తే. అతనివిద్య జిహ్వానటి శ్రుతివిధమున
నంగగుణమున నష్టాదశాత్మ యగుచు
విస్తరిల్లె నవద్వయద్వీపపృథగ

శేషభూజయలక్ష్మీజిగీషబోలె. ॥48॥

తే. తాఁ ద్రినేత్రునియపరావతార మగుటఁ
దెలుపు దిక్పాలకాంశావతీర్ణుఁ డతఁడు
కామసంచారహరణప్రగల్భ మైన
శాస్త్ర మనువేరియధికలోచనము కలిమి. ॥49॥

చ. కెరలి మహాసివేమసహకృత్వరితద్భటకోటిచాతురీ
తురి సమరాంగణంబులఁ జతుర్ధ్వరిదావరణంబులన్ యశో
బరముల నేయుచుండు బహుభంగులఁ బున్నమనాఁటినిండుచం
దురునునుసోగవెన్నెలలతోఁ దులఁదూఁగెడు తద్గుణంబులన్. ॥50॥

తే. తద్దిశాజయయాత్రోత్థధరణిధూళి
దోఃప్రతాపవైశ్వానరధూమరేఖ
పాలమున్నీటిలోఁ బడి పంక మయ్యె
నమృతదీధితిమైఁ జెంది యంక మయ్యె. ॥51॥

చ. అరయిక గల్గి భూమివలయం బఖిలంబును నీతి బాధలం
బొరయక యుండ నానృపతి పుంగవుఁ డేలుచు నుండ నొండుచో
నిరవయి యుండ కుండుటఁజుమీ యతీవర్షము లాశ్రయించెఁ ద,
త్పరనరనాథయూథవనితాజనతానయనోత్పలంబులన్. ॥52॥

ఉ. కొం డని వేడ్కతోఁ బసిఁడికొండ ధనార్థుల కెల్లఁ బంచి యీ
కుండుట దానధారకుఁ బయోనిధు లెల్ల వ్యయింపలేమి యీ
రెం డపకీర్తులం చల ధరించినవాఁడు ప్రదానశీలుఁ డా
తం డిరువాయ గా ముడికి దార్చిన వెండ్రుక లన్మిషంబునన్. ॥53॥

చ. నియమవిచిత్రభంగి మహనీయుఁడు భూమివిభుండు మిత్రజే
తయును నమిత్త్రజేతయుఁ బ్రతాపగుణంబున నీతిఁ జూరదృ
ష్టియును విచారదృష్టియు, నటే! పరిపంథిమహీశులట్ల త
ద్భయమున భేత్తృతాగుణము వాసెనొ కాక విరుద్ధధర్మముల్. ॥54॥

మ. ధన నేకాంఘ్రికనిష్ఠికాంగుళమ యాధారంబుగా నిల్చి ని
ర్భరలీలం గృతవేళ నెట్టన యధర్మంబుం దపస్విత్వముం
బొరసెం దక్కినవార లెవ్వరు తపంబుల్ సేయ! రమ్మేదినీ
శ్వరుసామ్రాజ్యమునందు ధర్మము చతుష్పాదంబునం గ్రాలఁగన్. ॥55॥

క. ఆరాజు విజయలక్ష్మికి
నీరాజన మాచరించు నిర్దగ్ధదిగం
తారాతిరాజనగరీ
దారుణవైశ్వానరప్రదక్షిణశిఖలన్. ॥56॥

చ. ఇతఁడు దరిద్రుఁ డౌ ననుచు నేర్పడ నర్థిలలాటపట్టికన్
శతధృతి వ్రాసినట్టి లిపిజాల మనర్థము గాని యట్లుగా
వితరణఖేలనావిభవవిభ్రమనిర్జితకల్పభూరుహుం
డతఁడు దరిద్రతాగుణమునందు దరిద్రుని జేయు నాతనిన్. ॥57॥

తే.* అతనికీర్తిప్రతాపంబు లవనిఁ గలుగ
నేల యివి! యంచు మదిలోన నెపుడు దలంచు
నపుడ పరివేషమిషమున నబ్జసూర్య
మండలముల విధాతృండు గుండలించు. ||58||

వ. అన్నలుండు నళినబాంధవుండునుంబోలెఁ బ్రతిదినంబును నభ్యుదయంబు నొందుచుఁ, గ్రమంబున శైశవంబు నతిక్రమించి యౌవనారంభంబున నరిదుర్గలుంఠనావసరంబులంబోలె లోహార్గళదీర్ఘపీనతయును గోపురద్వారకవాటదుర్ధర్షతిరఃప్రసారితయును బాహావక్షంబులచేత బందీగ్రాహంబు గ్రహించి రోమకోటికపటంబున హాటకగర్భుడు పాటించి లిఖించిన సుగుణగణనారేఖ లవయవంబులం బొలుపార సంపూర్ణపూర్ణిమాచంద్రబింబంబు విడంబింపం జాలునెమ్మొగంబునకుం గళంకాలంకారశంక నంకురింపఁజేయంజాలు కోమలశ్మశ్రురాజి విరాజిల్లం గండు మెఱసి రెండవకుసుమకోదండుండునుంబోలె విలాసినీమండలికిం గన్నులపండువై వెండియు. ||59||

తే. దాస్య మొనరించు విధుఁ డేతదాస్యమునకుఁ
బల్లవము లేతదంఘ్రిసంపల్లవములు
జలరుహములకుఁ దచ్ఛయచ్ఛాయదాయ
నాఁగ నతఁ డొప్పె నవయౌవనాగమమున. ||60||

వ. అయ్యవసరంబున. ||61||

తే. వానిఁ గలలోనఁ గానని వనజముఖియు
వాని మార్పును బేర్కొని మానవతియు
వానిఁ గా నాత్మ భావించి వరునిఁ గవయ
నప్పళింపనిసతియు లేదయ్యె నచట. ||62||

చ. దరహసితావధీరితసుధాకరబింబము నేత్రనిర్జితాం
బురుహము నైనయానిషధభూవరునుల్లసితాననంబుతో
సరి మఱి యొండ్లు గల్గమికి సంశయ మేటికిఁ దద్ద్వయీవిజి
త్వరకమనీయవస్తురహితం బగునట్టిచరాచరంబునన్? ||63||

క. తలవెండ్రుక లెగఁగట్టెడు
కొలఁదిన నానృపకుమారకుఁడు కడిమిమెయిన్
నలుదెసలకరులగండ
స్థలఫలకములన్ లిఖించె జయశాసనముల్. ||64||

తే. తరుణపాథోరుహాధోవిధానములను
ధరణినాథకిరీటాగ్రధానములను
నూర్ధ్వమయ్యెడు నిది యంచునొకొ విధాత
తత్పదం బూర్ధ్వరేఖాంకితంబు సేసె. ||65||

తే. అప్పుడు లీలావినిర్జితానంగుఁడైన
యతనిఁ గనియును వినియుఁ జింతానురక్తి
స్వర్గమర్త్యపాతాళవిష్టపములందు
విబుధనరభోగికాంతలు వివశలైరి. ||66||

ఉ. ఱెప్పలు వాల్ప కప్పుడమిఱేనిమనోహరమూర్తి నిచ్చలుం
దప్పక చూచి చూచి విబుధప్రమదల్ ప్రమదంబు లాత్మలం
జిప్పిలుచుండ నెద్ది పరిశీలన సేసిరొ యట్టియబ్బెసం
బిప్పుడు వారు చూపుదు రపేతనిమేషములైనచూపులన్. ॥67॥

తే. తద్గుణాకర్ణనంబునఁ దదనిరీక్ష
ణమున ధన్యత్వమును నధన్యతయుఁ బొంది
యభిమతానభిమత మైనయక్షియుగముఁ
దాల్చుఁ జక్షుశ్శ్రవఃస్త్రీకదంబకంబు. ॥68॥

చ. [2]మొలచినకూర్మి గన్నుఁగవ మోడ్చినయప్పు డజప్రభావనా
బలమున నానృపాలకునిఁ బాయక చూతురు మర్త్యభామ లా
యలికులనీలవేణులకు నమ్మెయి నవ్విభుఁ జూచువేళలన్
గలుగవు వో నిమేషపరికల్పనఁ బుట్టెడునంతరాయముల్. ॥69॥

సీ. కోరి లీలాగేహకుడ్యభాగంబుల
వ్రాయుదు రమ్మహీశ్వరునిమూర్తి
వ్రాసి కన్యాత్వగౌరవము వీసరపోవ
దర్శింతు రనురాగతరళదృష్టి
దర్శించి యతని కేఁ దగుదునొ తగనొ యం
చించుకించుక సంశయింతు రాత్మ
సంశయించి కరాంబుజములఁ గ్రొమ్మించుట
ద్దము లెత్తిచూతురు తముఁ దారు
తే. రాజకన్యలు జగతి నాక్రమమునందు
గందు వారలనిట్టూర్పు గాడ్పువేఁడి
ముకురములు చారుమోహనమూర్తి యనఁగఁ
బరఁగు దమయంతిచేతిదర్పణముదక్క. ॥70॥

వ. ఇవ్విధంబున ననన్యరూపలావణ్యరేఖావిలాసభాసమానయగు భీమనందన యానరేంద్ర బృందారకునియందు డెందంబు నిలుపుటయును. ॥71॥

తే. అప్పు డనలావరుద్ధత నారఁ గూరి
బాణపురమును బోనియాభైమిమనముఁ
బుష్పబాణాసనుఁడు భోగభోజి యైన
వరవయోవిశేషంబు వార్వముగఁ దఱిసె. ॥72॥

## దమయంతి నలునియం దనురక్త యగుట

వ. దమయంతియు శ్రవణప్రీతివాసనావశంబునం బ్రతిదినప్రవర్ధమానంబగు మనోనురాగంబు నిరూఢంబై యుండ. ॥73॥

మ. జనకుం గొల్వఁగ వచ్చినప్పుడు తదాస్థానంబులోఁ బాఠకుల్
వినుతప్రౌఢి వసుంధరాధిపతులన్ వేర్వేఱ కీర్తించుచో
వనితారత్నము వీరసేనుతనయున్ వర్ణింపఁగా నున్నత
స్తనభారంబు కెలంకుల న్నినుచుఁ జంచల్లీలరోమాంచముల్. ॥74॥

తే. మహిమ హిమవేళలందు నమ్మానవతికి
మాసరము లయ్యెఁ దలఁపంగ వాసరములు
పొడవు గలిగి తపర్తుసంపూర్తియందు
సంచితాయమవతు లయ్యె యామవతులు. ||75||

సీ. సఖులుఁ దాఁ బుష్పాస్త్రసామ్రాజ్యపదవికి
నభిషేక మొనరించు నవనినాథు
నలనామధేయ మైనతృణంబు వినఁబడ్డ
నధిపతిపే ర్విన్న యట్ల యలరు
నిషధదేశపువిప్రనికరంబుఁ బూజించి
యలయక ప్రియుసుద్ది యడుగఁ దలఁచు
నభ్యాసవశమునఁ బ్రాణేశ్వరునిమీఁది
యించుగీతములు వాయించు వీణ
తే. నేర్పు గలచిత్రకరులచే నిలయభిత్తి
భువనమోహనాకారతఁ బొలుపు మిగుల
మగని మగువను వ్రాయించి మదిఁ దలంచు
నిషధరాజును దన్నుగా నీరజాక్షి. ||76||

ఉ. పువ్విలుకానితోడ సరిపోలెడుచక్కనివాఁడు భూమిలో
నెవ్వఁడు చెప్పుడా? యనుచు నిష్టవయస్యలఁ గూర్చి యాత్మలో
నువ్విళులూరుచుం బలుకు; నొప్పులకుప్ప! నలుండు గాక యొం
డెవ్వఁ? డనంగ మెచ్చు దరళేక్షణ నెయ్యము వియ్య మెట్టిదో. ||77||

వ. మఱియు మనోరథపరంపరాసంవరణప్రసూనదామంబున నమ్మహీపతిం బతిగా వరియించియుం ద్రిభాగశేషంబు లగువిభావరీసమయంబు నిమీలితంబైన నేత్రయుగ్మంబును బాహ్యేంద్రియమౌనముద్రాభిముద్రితం బైనయంతఃకరణంబును మొఱంగి నిద్రాసమానీతుం డైనయారాజమనోజాతుతో నెంతయుం దడవు మంతనం బుండియు నిరంతరస్మరణసరణీధారావాహికావగాహంబున నెడనెడం బొడచూపు నప్పుడమిఱేనిం గనుంగొని లజ్జాసాధ్వసభ్రమంబులు మనంబులో ముప్పిరిగొనం బ్రమోదించియు నవ్వైదర్భి నిర్భరమదనశరశలాకాశంకుసంకలితవేదనాదూయమానమానసయై విజృంభితమనోభవభుజావష్టంభంబు లగుహిమారంభంబులును గాలాగరుకళంకితకామినీకంఠమూలంబు లగుశిశిరకాలంబులును గలకంఠకామినీకంఠకోమలకు హూకారకోలాహలకరంబితకకుబంతంబు లగువసంతంబులును, సాయంతనసమయసంఫుల్లమల్లికామోదమేదురసమీరణౌఘంబు లగునిదాఘంబులును విరహిజనహృదయభయంకరస్తనితసందోహంబు లగుజలధరానేహంబులును సకలజనమనోవికాసమయంబు లగుశారదసమయంబులును గడపుచుండె. నవ్వేళ జలధివేలావలయవలయితవసుంధరాభువనమండలాఖండలుం డగునలుండును విమలనిజకీర్తిమౌక్తికమాలికాసంతానంబులకు నంతర్ఘటనాగుణంబులుంబోలెఁ బొలుచు నక్కాంతాలలామంబు గుణంబులు జనపరంపరవలన వినియె. నాసమయంబున. ||78||

శా.* ఆవామాక్షి మనోహరాకృతి యమోఘాస్త్రంబుగా భూవరున్
లావణ్యాధికు నచ్చలంబు మెయిగెల్వంబూని యిందిందిర
జ్యావల్లీకిణకర్కశం బయినహస్తం బుద్ధతిం జాఁపి వే
పూవుందూపులజోదు పుచ్చుకొనియెం బుండ్రేక్షుకోదండమున్. ॥79॥

క. శ్రవణావతంస మయ్యెను
ధవళాయతనేత్రగుణము ధరణీపతికిన్
శ్రవణావతంస మయ్యెను
బువువింటిగుణంబు నపుడ పుష్పాస్త్రునకున్. ॥80॥

ఉ. ఆవసుధాధినాథుని మహాధృతిశాలి జయించు తెంపునన్
భావజుఁ డప్పు డున్మదనబాణము తియ్యనివింటఁ గూర్చుచోఁ
గేవలసాహసంబు మదిఁ గీల్కొనఁ జేసియు ముంచె దాఁ ద్రిలో
కీవిజయార్జితంబు లగుకీ ర్తిభరంబుల సంశయాంబుధిన్. ॥81॥

తే. అతనుఁ డఁట జోదు! పూమొగ్గ యఁట శరంబు!
చించినది యఁట తద్ధైర్యకంచుకంబు
నలుని దమయంతితోఁ గూర్పఁదలఁచియున్న
ధాత మదియెత్తికో ల్తుదిఁ దాఁకకున్నె! ॥82॥

ఉ.* ఎయ్యది కారణంబుగ మహీపతి యంచితధైర్యకంచుకం
బయ్యతనుండు సించె నలరమ్ములచే నది కారణంబుగాఁ
దొయ్యలి రాజనందనునితోడన కూర్పఁ దలంచుచున్నయా
దయ్యము నెత్తికోలు తుదిఁ దాఁకుటఁ గానఁగ నయ్యె నయ్యెడన్. ॥83॥

ఉ. ఏస విరి న్విరించి నొకయేటునఁ దామరపాన్పుపైఁ బడం
ద్రోసినజోదు మన్మథుఁడు దుర్వహనూత్నవియోగవేదనా
యాసిత మైనరాజుహృదయాబ్జము గాఁడఁగ నేసె నెంతయుం
గాసిలి తేఁటిటెక్క గఱి గట్టినపుష్పశిలీముఖంబులన్. ॥84॥

తే. లలన లజ్జాసరిద్దుర్గలంఘనమున
రాజహృదయంబుఁ జొచ్చినక్రమముఁ జూడఁ
దరుణిమారంభపరికల్పితంబు లైన
వలుఁదకుచకుంభములప్రభావమునఁ జూవె. ॥85॥

సీ. జాగరోద్భూతదృగ్రాగంబు మాణిక్య
కర్ణకుండలదీప్తిఁ గప్పిపుచ్చు
రాజకార్యపరంపరాఖేదమిషమున
నిట్టూర్పుగాడ్పుల నిహ్నవించు
ఘనసారబహుళచందనవిలేపనమున
నాపాండుభావంబు నపలపించు
దోరంతరన్యస్తతారహారంబుల
నంతఃపరీతాప మపనయించు
తే. మానసీయశశాంకకోమలము లైన

యామినీసమయములుఁ బర్యంకములును
సాక్షులుగ నొంచువలవంత జనవిభుండు
కన్నెకూర్మి ప్రకాశంబు గాకయుండ. ॥86॥

వ. ఇవ్విధంబున ననంవరం బైనశంబరవైరివిక్రమంబు క్రమక్రమంబునం బరిస్ఫుటం బగుచుండ వియోగవేదనాచిహ్నంబులు నిహ్నవింపం గొలంది గాక చీకాకుపడి యాకారరేఖావినిర్భర్త్సితమత్స్యలాంఛనుండగు రాజకుమారుం డొక్కనాఁ డారామవీక్షావిహారంబునం గాలక్షేపంబు సేయువాఁడై ప్రభంజనాధ్యేయజవంబును జంచలఖురాంచలక్షోదితక్షోణిమండలంబును నిగాళగదేవమణిదీప్తిచ్ఛటాపటలశంకావహకృకాటికాధవళకేసరకేశరశ్మిసంచయంబును వల్గువల్గాసుషక్తవదనతావిడంబితవక్త్రస్థభుజగవైనతేయంబును జలాచలప్రోథతానుమీయమాననిజవేగదర్పప్రశంసాప్రవచనోపన్యాసంబును నై సింధుజంబును శీతమహస్సహోదరంబును నగుట రెండవ యుచ్చైశ్రవంబునుం బోలిన యౌపవాహ్యంబు నారోహించి. ॥87॥

తే. ప్రమదనిష్పందతరనేత్రపద్మ లగుచుఁ
బౌరజనులు విలోకింపఁ బ్రకటలీల
సముచితానల్పపరివారసహితుఁ డగుచు
నవనినాథసుతుండు వాహ్యాళి వెడలె. ॥88॥

వ. తత్ప్రదేశంబున. ॥89॥

ఉ. నేమ మెలర్పఁగా గొడుగునీడ వహించువసుంధరాస్థలీ
సీమనె యెక్కి యాడెను విచిత్రగతిం దురగోత్తమంబు నా
భూమివిభుండు దద్భ్రములు వో యెడత్రెవ్వక యభ్యసించు వా
త్యామయచక్రచంక్రమవిహారములన్ సుడిగాడ్పు లీడ్చుచున్. ॥90॥

వ. ఇవ్విధంబునఁ గొంతతడ వతిజవనచతురతురగనర్తనక్రీడాడోలాయమానమణికుండలమరీచిమండలీనీరాజితగండస్థలుం వాహ్యాళివిహారంబు సలిపి వలయునమాత్యులం బరివారంబును నచ్చోటన యుండ నియమించి యొక్కరుండునుం బాదచారియై ఘనచ్ఛాయంబునుం బ్రవాళరాగచ్ఛురితంబును నగువిలాసకాననంబు పయోనిధానంబు నంబుజాక్షుండునుం బోలెఁ బ్రవేశించి. ॥91॥

## నలుని యుద్యానవనవిహారము

తే. పత్త్రములమీఁద మూఁగినభ్రమరకులము
హరవిసర్జనజనితదుర్యశముఁ బోలఁ
గమియ విచ్చినగేదంగికన్నెపువ్వుఁ
గౌతుకము పల్లవింపంగఁ గాంచె విభుఁడు. ॥92॥

వ. విరహిజనహృదయచ్ఛేదనక్రియాక్రకచంబులు వియోగిమర్మవిదారణవ్యాపారకర్ణినారాచంబులు పాంథజనహృషీకసూచకశలాకలు నగుకనకకేతకీజాలంబులఁ జేరం జనుదెంచి. ॥93॥

చ. చిలుపనికమ్మఁదేనియలు చిప్పిలి హస్తము లస్తకంబునన్

నిలువక నేరువాఱునెడ నీయతిసాంద్రపరాగము ల్గదా
యలరులవింటిజోదునకు నప్పటి కప్పటి కప్పళించుకో
గలిగెడు నంచు వే కనలు గైకొని దూఱె విభుండు కేతకిన్. ॥94॥

మ. దమయంతీస్తనకుంభవిభ్రమముఁ బొందం గోరుటన్ ధూమ
పానముఁ గావించు చధోముఖంబు లగునానాకుంభముల్ వోలె ధూ
పములన్ దోహద మాచరింపఁగఁ గడుం బక్వంబులై యున్నదా
డిమముల్ సూచి నృపాలకుండు మదిఁ బాటించెన్ మహౌత్సుక్యమున్. ॥95॥

తే. మన్మథుం డేయుకింశుకమార్గణములు
చన్నుఁగవ నాటుటయుఁ బాంథసతియుఁ బోలెఁ
బాఱుదెంచి కీరంబులు పండ్లు గఱవ
వణఁకుబాడిమిఁ జూచె భూవరుఁడు వేడ్క. ॥96॥

వ. మఱియు మందానిలపరిస్పందంబునం గందళితంబు లైనమకరందబిందునిష్యందంబులు చిందించుగురివెందపూఁబందిరులును వలచరాచవారికి వనదేవత లొనర్చునీరాజనప్రదీపాంకురంబులుం బోనికోమలకోరకంబులం గరంబు సొంపారుసంపెంగలును మదనచాపవిముక్తంబులై మొదలం గ్రోలిన భవశరీరభస్మాంగరాగంబు పరాగవ్యాజంబున వెడలం గ్రాయుచున్న సురపొన్నలును రోలంబనికురుంబంబులకుఁ బానగోష్ఠీస్థానంబు లగువికస్వరస్థలకమలినీకదంబంబులును గలకంఠకంఠహంకారంబులం బాంథులకు భయంబు సంపాదింపఁ జాలు క్రొమ్మావిమోకచాలును ధూమకేతుమండలంబులుంబోలె విరహిజనులగుండియ లవియించుచుఁ జంచరీక పరంపరాశిఖరంబులై సొంపారుచాంపేయంబులును వలయాకారంబునం బరిశ్రమించుభ్రమరంబులసంగతిం గేసరరేణువిస్ఫులింగంబు లెగయ బాణోత్తేజనప్రకారంబు నంగీకరించుచు ననంగునకుం బ్రథానశాణంబు లగునారంగంబులును మృదులపవమానసంపాతకంపమానకిసలయకంటకప్రక్షతంబులై మదనముద్రాభిముద్రితంబు లగువారాంగనాజనంబుల వట్రువపాలిండ్లకుం జుట్టంబులై తోరంబు లగుమారేడుఁబండ్లును నిఖిలయువద్వయీచిత్తనిమజ్జనోచితంబు లగుసజ్జకపుఁ బూమొగ్గలును బ్రవాళగర్భగహ్వరంబులందు వహియించుచు నించువిలుకానితూణీరంబులకుం బోల్పఁ బట్టైన కలిగొట్టుపొదలును నొండొండ చంద్రఖండంబులు వెడలంగ్రక్కు రాహుమండలంబులుంబోలెఁ గుటిలసితకుట్మలంబులు వ్రేలం గాఢాంధకారంబునం గాఱుకొను మునిద్రుమంబులును గనుంగొనుచుఁ బోషితరాజకీరంబులు కైవారంబులు నేయఁ బ్రోదికోయిలలు మంగళగానం బొనర్పఁ గొలంకులకెలంకులను బావులక్రేవలను నికుంజక్రోడంబులనీడలను విశ్రమించుచుం బ్రసవమృదుగంధపశ్యతోహరంబు లగుగంధవాహంబుల రాకలు విహారశ్రాంతి నపనయింప వికటఘటీయంత్రసలిలధారాసారణీమార్గంబులఁ డెక్కెంబునకుం జక్కనిగండుమీను వెదకుమీనకేతుండునుంబోలె నుద్యానం బెల్లఁ గ్రుమ్మరి యగ్రభాగంబున. ॥97॥

సీ. శేషపుచ్ఛచ్ఛాయఁ జెలువారుబిసములు,
తన్మగ్నసురదంతిదంతములుగ
నిండాకవిరిసిన పుండరీకశ్రేణి
యామినీరమణరేఖాళి గాఁగఁ
బ్రతిబింబితోపాంతబహులపాదపములు

గర్భస్థశైలసంఘములు గాఁగ
నేకదేశంబున నిందీవరంబులు
కాలకూటమయూఖఖండములుగ
తే. బాలశైవాలవల్లరీజాలకంబు
బాడబానలభవధూమపంక్తి గాఁగ
వారిరాశయుఁబోలె గంభీరమైన
ఘనతటాకంబుఁ గాంచె నజ్జనవిభుండు. ॥98॥

వ. కాంచి యొక్కింతతడవు మనంబునం గొనియాడుచుం దిమితిమింగిలఢులీకుళీర మత్స్యకచ్ఛపమకరనికరసంచారతరళ తరంగమాలికాడోలారోహలీలావ్యాలోల కలహంససంసదాలాసకోలాహలముఖరితదిశాభాగం బైన యమ్మహాతటాకంబుతీరప్రదేశంబున. ॥99॥

సీ. విలులితజంబాలపులినభాగమున ను
ద్దండపద్మాతపత్రంబునీడఁ
గమలకాండకఠోరకంటకాంకురపంక్తి
నొయ్యనఁ గంధరం బొరసికొనుచు
నొంటికాలనె నిల్చి యూర్మిమారుతములం
జిగురుఱెక్కలఱేకు లెగయుచుండ
విరళమై పక్షతిద్వితయంబు వెడజాఱఁ
జంచు లోకించు కాకుంచితముగ
తే. వరుణరాజున కిడినచామరమువోలెఁ
బొడవు మిగిలినపొందమ్మిపువ్వుఁబోలె
నిబిడనిద్రాభిముద్రితనేత్ర మైన
రాజహంసంబుఁ గాంచె నారాజసుతుఁడు. ॥100॥

క.* కాంచనపక్షం బగురా
యంచం గనుఁగొని నృపాలుఁ డనురాగముతో
వంచించి పట్టుకొనియెద
నంచుఁ దలఁచె దైవఘటన కనుకూలముగాన్. ॥101॥

## నలుడు హంసముం బట్టుకొనుట

తే. వామనుం డైనకైటభవైరివిధము
నభినయించుక్రమంబున నధిపసుతుఁడు
నడిఁకి నడిఁకి యల్లల్లన నడిచి పట్టెఁ
బాణిపద్మద్వయంబునఁ బసిఁడియంచ. ॥102॥

వ. ఇట్లు నిషధరాజుచేతం బట్టుపడి బిట్టు మేల్కాంచి యక్కాంచనహంసంబు కంచుగీసినతెఱుంగున నెలుంగించుచు నెగయ నుంకించుచుఁ జంచుపుటంబునం బాణిపల్లవంబులు గఱచుచుఁ జరణంబులు గింజుకొనుచు నఖంబుల నొత్తుచు నలుదిక్కులుం జూచుచు నెద్దియుం జేయునది లేక చీకాకుపడుచుండ నప్పాటవసంభ్రమసముత్పతత్పతగకులంబై కమలషండంబు గలగుండుపడియెఁ గూలంబులం గులాయంబుల నుండి పుండరీకవనలక్ష్మీచరణనూపురక్రేంకారంబుల ననుకరించుచుఁ గారండవబకగ్రౌంచరథాంగకోయష్టికాదులు విహాయసంబున కెగసి

కూయం దొడంగె నప్పుడు. ||103||

తే. జాతరూపచ్ఛదచ్ఛటాజాతరూప
లక్ష్మి యిం తొప్పునే మరాళమున కనుచు
నద్భుతం బంది తనుఁ జూచునధిపసుతున
కిట్లనె మనుజభాషల హేమఖగము. ||104||

క. ఔక్కలకొనలం గలిగిన
యిక్కాంచన మాసపడియెదే నృప! నీకే
యక్కఱ దీనం దీరెడు
నక్కట! నీహారలేశ మబ్ధికిబోలెన్? ||105||

చ. ఎఱుఁగనె నీవు ప్రాంతమున నింతట నంతట నున్కియింత యే
మఱుదునె నిన్ను విశ్వజనమాన్యుఁడ వంచును విశ్వసించి యి
త్తటి సుఖనిద్రఁ బొందితి వృథామతి నెట్టన యాత్మ నమ్మినం
జెఱుపఁదలంతురే ఘనులు చిత్తమునన్ బగవారి నేనియున్? ||106||

ఉ. హింసయ నీకు వేడ్క యగునేని కృపాశ్రయ మైనయీసరో
హంసముఁ జంప నేల! కఱవా తరువాత వసుంధరాధిపో
త్తంస! విజృంభమాణభుజదర్పనిరంకుశసాహసక్రియా
మాంసలచిత్తవృత్తు లయి మత్తిలి యుండునరాతిభూపతుల్ .||107||

వ. ఫలకుసుమమూలమాత్రంబున శరీరయాత్ర నడపుచు మునులుంబోలె సలిలంబులలోనం దపంబు సేయుచున్నవారము మామీఁద దండనీతిం బ్రయోగింప నీకుం దగునె? యదియునుం గాక. ||108||

సీ. తల్లి మదేకపుత్త్రక పెద్ద కన్నులు
గాన దిప్పుడు మూఁడుకాళ్లముసలి
యిల్లాలు గడుసాధ్వి యేమియు నెఱుఁగదు
పరమపాతివ్రత్యభవ్యచరిత
వెనుకముందర లేరు నెన రైనచుట్టాలు
లేవడి యెంతేని జీవనంబు
గానక కన్నసంతానంబు శిశువులు
జీవనస్థితి కేన తావలంబు
తే. కృపఁ దలంపఁ గదయ్య యోనృపవరేణ్య!
యభయ మీవయ్య! యోతుహినాంశువంశ!
కావఁగదవయ్య! యర్థార్థికల్పశాఖి!
నిగ్రహింపకుమయ్య! యోనిషధరాజ. ||109||

వ. అక్కటకటా! దైవంబ! నీకంటికిం బేలగింజయు బెద్ద యయ్యెనే? జననీ! ముదిసి ముప్పుకాలంబున సుతశోకసాగరం బెబ్బంగి నీదగలదానవు! ప్రాణేశ్వరీ! యేచందంబున మద్విరహవేదనాదవానలంబునం దరికొనియెదవు? సఖులార! యేప్రకారంబునం బుటపాకప్రతీకాశం బైనకరుణరసంబునఁ బురపురం బొక్కెదరు? బిడ్డలార! యేలాగున నతిక్షుత్పిపాసాకులంబులై కులాయకూలంబులం గులగులం గూసెద రని విలాపంబు సేయుచు దృగ్గోళంబుల వేడికన్నీరు వెడల గోలుగోలున

నేడ్చినం గృపాళుండై భూపాలుండు హస్తపల్లవంబులు వదలి రాజహంసంబ! పొమ్ము సుఖం బుండు మని విడిచి పుచ్చె. ననంతరంబ. ||110||

## ఆశ్వాసాంతము

శా. భారద్వాజపవిత్రగోత్ర! విమలాపస్తంబసత్సూత్ర! వి
ద్యారాజార్ధకిరీట! రాజహితకార్యారంభనిర్ధారణా
ధౌరంధర్యకళాయుగంధర! సమిద్ధగాండీవి! శ్రీఖండక
ర్పూరక్షోదవిపాండునిర్మలయశఃపూర్ణక్షమామండలా! ||111||

క. కేళాదిరాయ! యభినవ
లీలామకరాంక! చంద్రలేఖాంకురచూ
డాలంకారపదాంబురు
హాలింగనసుఖితనిస్తులాంతఃకరణా! ||112||

మాలిని. జరఠకమఠరాజస్తబ్ధరోమప్రధాన
ద్విరసనపతిభూభృద్దిగ్గజగ్రామభూమ
స్థిరతరధృతసంపద్గేహబాహాగ్రపీఠీ
పరిచయసుఖలక్ష్మీపక్ష్మలక్షోణిచక్రా! ||113||

గద్యము. ఇది శ్రీమత్కమలనాభపౌత్త్ర మారయామాత్యపుత్త్ర సకలవిద్యాసనాథ శ్రీనాథప్రణీతంబైన శృంగారనైషధకావ్యంబునందుఁ బ్రథమాశ్వాసము.

[1] *ఈగుర్తుగలవి తిమ్మకవి పాఠములు.

[2] పొలుపొనఁగూడి; పొలుపొగిజూచి అని పాఠాంతరములు.

శ్రీరస్తు

# శృంగారనైషధము

## ద్వితీయాశ్వాసము



శ్రీరాజరాజవేమ
క్ష్మారమణకృపాకటాక్షసంవర్ధితల
క్ష్మీరక్షితబుధలోక! యు
దారగుణాధార! సింగనామాత్యమణీ. ॥1॥

వ. అవధరింపుము. ॥2॥

### హంస నలునిచే విడువఁబడి కృతజ్ఞతఁ జూపుట

తే. అట్లు పురుషోత్తముం డైనయతనివలన
ముక్తి గాంచినయాద్విజముఖ్యుఁ డెలమి
డెందమునకును వాక్కున కందరాని
యధికతర మైనయానంద మనుభవించె. ॥3॥

క. చుట్టంబులుఁ జెలులుం దన
చుట్టుఁ దిరిగి యుండ ముదము సొం పెసలారన్
నెట్టిపడి చచ్చి క్రమ్మఱఁ
బుట్టినచందమున హంసము దటాకములోన్. ॥4॥

సీ. ఊక్కించికొనియున్న ఱెక్క మొత్తముతోడి
యొడలు జాడించి నెవ్వడి విదిర్చుఁ
జేదోయియొత్తునఁ జేసి నెత్తురు లైన
యవయవంబులు నోర సవర చేయుఁ
గుటిల చంచూపుటకోటికుట్టనములఁ
దనుకీటములనిరోధంబు మాన్చుఁ
దొడరుజుంజురుమేనిదుర్వికారంబునఁ
బులుఁగుఁజుట్టాల బి ట్టులియఁజేయు
తే. నూర్మిపంక్తుల నుయ్యాల లూఁగి యాడుఁ
దివుటఁ దియ్యనితమ్మిపూఁదేనె గ్రోలుఁ
బ్రమదమున నాఁచుఁదీగెజొంపములఁదూఱు
నరుగుఁ గేళికులాయశుద్ధాంతములకు. ॥5॥

వ. ఇవ్విధంబునం గొంతదడవు గ్రీడించి యానీడోద్భవంబు భవార్చనాయోగ్యంబును రుద్రాక్షమధువ్రతపరివృతంబును బహుశైవలక్ష్మతాసమన్వితంబును నగుటఁ బద్మంబునుం బోని నిషధరాజు హస్తంబునకు గ్రమ్మఱ నరుగుదెంచె

నమ్మహాభుజుండును భుజంబు సాఁచి యమ్మానసౌకంబు మన్నించి యిమిడ్చికొనియుండె నప్పుడు. ||6||

తే. ఇష్టమానస మయినయాహేమఖగము
నలునిమానస మానందజలధియందుఁ
గర్ణశష్కులికలశంబుఁ గౌఁగిలించి
యూఁదఁ జేయుచు మృదుభాష నిట్టు లనియె. ||7||

వ. దేవా! యవధరింపుము ధర్మశాస్త్రమర్మపారగులైన పెద్దలు 'దుర్బలకులజిఘాంసువులైన ఝషంబులను నీడద్రుమపీడా కరంబు లైననీడజంబులను ననవద్యతృణహింసానృశసంబు లగుమృగంబులను మృగయావినోదంబుల వధియించి మహీధవుండు కిల్బిషంబునఁ బొందం' డని చెప్పుదు. రిప్పట్టునం బట్టువడిననన్ను విడిచిపెట్టి ప్రాణంబు రక్షించిన యుపకారికిం బ్రియంబు సేయుదు నన నేర్తునే! యైనను నీకు నొక్కప్రియంబు చేసెద. నయాచితోపపన్నం బయినహితంబు పరిహరింపం బని లేదు. నిఖిలభువననాయకుండ వైననీకు మముబోంట్లు సేయునుపకారం బవేక్షణీయంబు గాకుండుట యెఱుంగుదు. నైనను గృతజ్ఞతాగుణలేశంబు క్లేశపఱుచుచున్నయది. సన్నంబు దొడ్డయనువిశేషంబు విచారింపక హస్తకల్పజనాంతరం బయినదైవంబుప్రశస్తి విమర్శించి నాచేయుప్రయోజనం బంగీకరింపుము. ||8||

## హంస నలునికడ దమయంతి నభివర్ణించుట

సీ. ప్రత్యర్థిసార్థసార్థకనామధేయుండు
భూమీశ్వరుం డొప్పు భీముఁ డనఁగ
నారాజు త్రిదివంబు సమరేంద్రుఁడునుబోలెఁ
దేజంబున విదర్భదేశ మేలు
దమనాహ్వయుం డైనతపసిసద్వరమునఁ
గాంచె నాతఁడు కన్యకాలలామ
సర్వలోకాంగనాసౌభాగ్యగరిమంబు
దమియించుకతమున దానినామ
తే. మభ్రభారతి దమయంతి యంచు నొడివెఁ
దద్గుణంబులు వర్ణింప ధరణినాథ!
యబ్జసూతికి నైన శక్యంబు గాదు
పలుకుఁబూఁబోఁడి కైనను నలవి గాదు. ||9||

తే. విదుషి యాయింతి దలఁదాల్చు వెండ్రుకలకు
నహహ! యెబ్భంగి సాటి సేయంగవచ్చుఁ
బశువుచేతఁ బురస్కృతిఁ బడయలేక
చాపలంబున వర్తించుచామరములు? ||10||

క. ఖురకండూయనమిషమున
హరిణంబులు సాంత్వనంబు నాపాదించున్
దరుణివిలోచనములచేఁ
బరిభూతము లైనతమచపలదృష్టులకున్. ||11||

క. లలనకనుదోయిముందట
నలనడ నలినంబు మలిన మయ్యెను హరిణం
బులు పూరి మేయం దొణఁగెను
గలితద్యుతి ఖంజ మయ్యె ఖంజనకులమున్. ॥12॥

తే. రాజబింబంబునందు సారము హరించి
చేయఁ బోలు విధాత యాచెలువమోము
నడిమిరంధ్రంబునందుఁ గానంగ వచ్చు
ఖనిఖనీలిమ యది నివదర్శనము గాదె! ॥13॥

క. ప్రవిలేపనపాండరమును
నవలాంఛనగోమయాంచనము నగురాకా
ధవళాంశమండలము విధి
నివాళి సేయును లతాంగి నెమ్మొగమునకున్. ॥14॥

సీ. జగము లొక్కుమ్మడి సాధింప నెత్తిన
రతిమన్మథులవిండ్లు రమణిబొమలు
కాంతినిర్ఝర మీఁదుకామయౌవనముల
కుంభప్లవము లింతికుచఁయుగంబు
నడు మింత యని కేలఁ దొడిపట్టినధాత
యంగుళిరేఖ లబ్జాస్యవళులు
యువమనోమృగరాజిఁ దవిలింపఁ దీర్చిన
మదనవాగుర లిందువదనకురులు
తే. బాల్యతారుణ్యసీమావిభాగమునకు
నజుఁడు వ్రాసిన లేఖ తన్వంగియాలు
భానువరమునఁ బడసిసపంకజముల
యపరజన్మంబు పూబోణియడుగు లధిప! ॥15॥

క. జలదుర్గస్థమ్మృణాళా
వలిజిత్కమనీయబాహువల్లరి యగునా
జలజానన నీకుం దగుఁ
బలుకులు వేయేల యధికబలశౌర్యనిధీ! ॥16॥

క. హాటకకలశంబులకును
బాటి యగువధూటి మెఱుఁగుఁబాలిండ్లు నిరా
ఘాటస్ఫురణప్రభ యను
నేటికిఁ జక్కవలకవ యయి విరాజిల్లెన్. ॥17॥

తే. వలుదయును వట్రువయుఁ గాఁగ నలినభవుఁడు
భీమభూపాలపుత్త్రికిఁ బిఱుఁ దొనర్చె
నర్కరథశిల్పశిక్షఁ బుష్పాస్త్రుతేరు
నేకచక్రంబు సేయ నూహించి యొక్కొ. ॥18॥

మ. వనజాతేక్షణ యూరుయుగ్మమున లావణ్యంబునం గేళికా
ననసంక్రందనపట్టనప్రకటజన్మస్థానలన్ రంభలన్

ధనదాపత్యతపఃఫలస్తనుల నత్యంతాభిరామాంగులన్
మనుజాధీశ! యధఃకరించుఁ బొగడన్ మాబోంట్లకున్ శక్యమే? ॥19॥

మ. మృదురీతిం బ్రతివాసరంబు గమకర్మీభూతనానానదీ
నదకాంతారపురీశిలోచ్చయుఁడనై నైకాద్భుతశ్రీజిత
త్రిదివం బైనవిదర్భదేశమున నారీకత్నముం గాంచితిన్
సదసత్సంశయగోచరోదరి శరత్సంపూర్ణచంద్రాననన్. ॥20॥

మ. కమలేందీవరషండమండితలసత్కాసారసేవారతిన్
గమికర్మీకృతనైకనీవృతుఁడనై కంటిన్ విదర్భంబునన్
రమణిం బల్లవపాణిఁ బద్మనయనన్ రాకేందుబింబాననన్
సమపీనస్తని నస్తి నాస్తి విచికిత్సాహేతుశాతోదరిన్. ॥21॥

వ. కాంచి, విబుధపురపురంధరీరామణీయకం బీరమణీరత్నంబుముందట నిస్సారంబు పొమ్మనియును విధాతచిత్తంబున నీమత్తకాశినికిం దగిన యుత్తముణ డగువరు డెవ్వండు గలిగియున్నవాఁడొకో యనియును జింతించుచుం గొంతదడవు నివ్వెఱపడి చూచుచుండిరి. ననంతరంబ యనురూపలావణ్యరేఖాసంపన్నుఁ డైనపిన్నవయసురాకొమరు నవలోకింతు నని లోకాలోకపర్యంతంబుగా నీలోకంబు విశ్వంబునుం బరిభ్రమించి యుర్వీశ్వరకుమారకుల నెల్లం బూర్వపక్షంబు గావించుచు వచ్చి వచ్చి యిచ్చోట నిన్నుం గనుంగొని సిద్ధాంతీకరించితి. సాదృశ్యనిబంధనంబై పొడమినసంస్కారబోధంబుఁ జిరకాలావలోకిత యగునబ్బాల యిప్పుడు నామనంబునం బొడగాననవచ్చుచున్నయది. ॥22॥

క. దమయంతీకిలకించిత
మమృతాంశుకులావతంస యలరించు నినున్
విమలతరతారహారము
రమణీరమణీయకుచభరంబును బోలెన్. ॥23॥

తే. సౌరభము లేనియట్టిపుష్పంబువోలె
గండుఁగోయిల వెలియైనకానవోలె
నధిప! దమయంతితోడిసఖ్యంబు లేని
నీదుసౌందర్యవిభవంబు నిష్ఫలంబు. ॥24॥

వ. కావున నిఖిలవైమానికనికాయకామ్యమానయాన యమ్మాన్యవతికి నిన్నుం గూర్ప నాకు నేర్పు గల దక్కొమ్మ నెమ్మనంబున నిన్నుం దక్కఁ దక్కొరుం బరిగ్రహింపకుండ నట్లుగా భవద్గుణంబులు ప్రశంసించెద, నన్నుం బనిగొమ్ము, లెమ్ము, కార్యంబున నార్యులు నిజప్రయోజనంబు నెఱింగింతురు, గాని మాటలం బ్రకటింప రని పరిస్ఫుటంబుగాఁ బలికిన. ॥25॥

తే. ఆద్విజాధిపువలన సంప్రాప్తమైన
వాక్సుధాధారఁ గ్రోలి భూవల్లభుండు
లలితలీలఁ దదుద్గారలవమువోలె
మొలకనవ్వు వహించెఁ గెమ్మోవిమీఁద. ॥26॥

వ. ఇవ్విధంబున మందస్మితసుందరవదనారవిందుండై కరారవిందంబునం బతంగపుంగవునంగంబు నివురుచు మృదుభాషణంబుల నిట్లనియె. ॥27॥

సీ. అండజాధీశ నీయాకారరేఖతోఁ
దులఁదూఁగలేవు వస్తువులు జగతి
నీడోద్భవశ్రేష్ఠ! నీదుసౌశీల్యంబు
పలుకుల కందంగఁ గొలఁది గాదు
పతగపుంగవ! నీసుభాషితంబులయట్ల
యవయవంబులు సువర్ణాత్మకములు
పక్షివంశవతంప! పక్షపాతము నీకు
గతియంద కాదు సద్వ్రతతియందు
తే. [1]నధికతాపపరీతాత్ముఁ డైననాకు
నెట్లు వచ్చితి చలిగాడ్పునట్లు నీవు
పూర్వజన్మమహాతపస్స్ఫురణఁ జేసి
నీదుసన్నిధి సమకూరె నిధియుఁబోలె. ॥28॥

మ. త్రిజగన్మోహమహౌషధీలతిక ధాత్రీపాలకన్యావరో
ధజనోత్తంసమణిప్రరోహ మగునాతన్వంగి వేమాఱునుం
బ్రజ లెల్లన్ వినుతింపవిందు మొదలం బక్షీంద్ర యూహింప
నక్కజ! మీ విప్పుడు సంస్తుతింప సది సాక్షాత్కారముం బొందెడున్. ॥29॥

తే. [2]సహృదయుండును హృదయంబు సమ్మతింప
సరయువారికి నఖిలంబు నకలుషంబు
చెంతనైనను సూక్ష్మ మీక్షింపజాల
దాన నాలంక్రియామాత్ర మక్షియుగము. ॥30॥

ఉ. తియ్యనితేనెవోలె సుదతీతిలకంబుగుణంబు లుత్సవం
బయ్యె శ్రుతిద్వయంబునకు నాదిమకాలమునందు నిప్పుడా
తొయ్యలి నీవు సమ్మదముతో వినుతింపఁగ మన్మథాగ్నికిం
ధాయ్యయుఁబోలె నయ్యె నది; ధైర్యము పల్లటిలెన్ ఖగేశ్వరా! ॥31॥

శా. కాలాంతఃపురకామినీకుచతటీకస్తూరికాసౌరభ
శ్రీలుంటాకము చంచనాచలతటశ్రీఖండసంవేష్టిత
వ్యాలస్ఫారఫణాకఠోరవిషనిశ్శ్వాసాగ్ని పాణింధమం
బేలా నాపయి దక్షిణానిలము పక్షీ! సేయు దాక్షిణ్యమున్? ॥32॥

క. నెలనెల దప్పక యుండఁగ
నెల భాస్కరుఁ జొచ్చు టెల్ల నియమముతోడన్
గలహంస వేఁడివెన్నెల
సొలయక నాయంగకములు సూఁడుటకుజుమీ. ॥33॥

ఉ. మోహము దాహమున్ మదికి మూఁడ్చుచు నున్నవి పాయవెప్డు సం
దేహము మీనకేతనునిదివ్యశరంబులు పువ్వుమొగ్గలో?
యూహ యొనర్పఁగాఁ బిడుగులో? కులిశంబులొ? యట్లు! భారతీ
వాహకులావతంస! విషవల్లిసముద్భవముల్ ప్రసూనముల్. ॥34॥

## హంస దమయంతికడకు దూతయై చనుట

వ. కావునం దీరంబు లేనివిరహభారం బనుపారావారంబున మునుంగంబాఱుచున్న నాకుం దెప్పగా విరించి నిన్నుఁ గల్పించినాఁడు, మిముబోఁట్లగు పెద్దలగుణంబులు పరార్థప్రవణంబులు గదా! పొమ్ము, కార్యము సాధింపుము, పునస్సమాగమంబయ్యెడు, నీవు వచ్చునంతకు నిచ్చోటన యుండుదుంజుమీ! చూతము గదా నీగమనవేగం! బని పల్కి యన్నీడజంబు వీడుకొల్ని క్రీడావనంబులో నొక్కనికుంజక్రోడంబునీడ నన్నరేంద్రుండు చంద్రకాంతశిలాతలం బున విశ్రమించి రాయంచపలుకులు మనంబునం దలపోయుచుండె. గలహంసంబును నలుని వీడ్కొని భూమండలమండనాయితంబైన కుండిననగరంబున కభిముఖంబై ప్రార్థనాసిద్ధిసూచకంబులగు ననుకూలగంధవాహాదినానావిధశుభనిమిత్తంబులను సంధించుచు నికషపాషాణపట్టనిభం బయిననభస్థలంబునం దసపసిండిఱెక్క లొరపెట్టుచందంబున నెందంబుగా ఝంకారితపతత్త్రధారావిహారంబుగ గోడివడి డిగ్గునప్పు డల దిగువ నున్నపతంగంబులు వడవడ వడంకుచు నొంటికంటఁ గనుంగొన నొక్కొక్కమాటు విధూతపక్షతియును నొక్కొక్కసారి యూర్ధ్వాయనదుర్విభావంబును నొక్కొక్కమాటు వితతీకృతనిశ్చలచ్ఛదగుచ్ఛంబును నగుచు వనంబులు గడచి శైలంబులు దాఁటి నదులు లంఘించి చని చని ముందట. ||35||

## కుండిననగరవర్ణనము

ఉ. అండజరాజు గాంచె లవణాంబుధివేష్టితమేదినీపధూ
కుండలమండనం బయినకుండినమున్ నిజకీర్తికల్పితా
ఖండలపట్టణప్రథితఖండనమున్ గ్రథకైశికేంద్రదో
ర్దండబలాభిగుప్తము సుదగ్రహిరణ్మయవప్రదీప్తమున్. ||36||

వ. అప్పట్టణంబున కరిగి వప్రనదీప్రాకారంబు లగుప్రాకారంబులవలనను, నారసాతలగంభీరసలిలసంచారంబు లగుపరిఖాకూపారంబులవలనను, బ్రస్ఫుటస్ఫటికోపలవిగ్రహంబు లగుగృహంబులవలనను, శశిభిత్తివిమలభిత్తిసమత్సేధంబు లగుసౌధంబులవలనను, నింద్రనీలమణిచ్ఛాయాకల్పితాకాలకాలిక లగుచంద్రశాలికలవలనను, గేలీవిలోల బాలికా కుచ లికుచఘుసృణపంక కషాయితాంభఃపూరంబు లగుకాసారంబులవలనను, ఘనఘనాఘనఘటాకఠోరఘర్ఘరధ్వానగోధూమఘరట్టంబు లగుహట్టంబులవలనను, అనిలచలచ్చేలాంచలదండతాడనావిహితహేళిహయాళీకాలనక్రియాదత్తామారువిశ్రాంతు లగుప్రాసాదవైజయంతులవలనను, నవవికచవివిధకుసుమవాసనాపేటిక లగులీలోద్యానవాటికలవలనను, బటీరకర్పూరకస్తూరికాకుంకుమదహిమాంబుప్రముఖ నిఖిలపరిమళవస్తువిస్తారసౌరభోద్గారసముత్పణంబులగు నాపణంబులవలనను, హావభావవిలాసవిభ్రమైకభాజనంబు లగువనితాజనంబులవలనను, జనవిజితమరత్కురంగంబు లగుతురంగంబులవలనను, అసమసమరవిజయకారణంబు లగువారణంబులవలనను, నభిరామంబై యక్కలహంసంబునకుఁ గౌతుకం బాపాదించె. వెండియు. ||37||

తే. పరిఖ గుడివోల దనచుట్టు దిరిగి యుండఁ
బరుల కేరికి గ్రహణగోచరము గాక
విషధరాధీశభాషితవిషమభాష్య
ఫక్కికయుఁ బోలె నొప్పె నప్పట్టణంబు. ||38||

క. నెలపొడుపుల సురనదిని
ర్మలతరతదగారకుట్టిమస్రవదిందూ
పలతుందిలాప యగుచుం
దెలి వొందుఁ బతివ్రతౌచితీసంపత్తిన్. ||39||

తే. క్రుంగఁబొఱుసహస్రాంశుఁ గూడ లేక
వెనుకఁ జిక్కినజరదంశువితతివోలెఁ
బొలుచునపరాహ్ణవేళ నప్పురమునందు
భాసురాలేపకాశ్మీరపణ్యవీథి. ||40||

శా. వేదాభ్యాసవిశేషపూతరసనావిర్భూతభూరిస్తవా
పాదబ్రహ్మముఖౌఘవిప్లుతనవస్వర్గక్రియాకేళిచే
నాదిన్ గాధితనూజుచే సగము సేయం బడ్డమిన్నేఱు ప్రా
సాదస్వచ్ఛదుకూలకైతవమునం జాలంగ నొప్పుం బురిన్. ||41||

తే. అమరు హాటకమయకవాటములతోడ
గురుతరం బైనయప్వీటికోటగవను
కులిశధారకుఁ దప్పి ఱెక్కలును దాను
బయటఁ గొలు వున్నపసిడికొండయునుబోలె. ||42||

మహాస్రగ్ధర. దమయంతీకేళిధాత్రీధరశిఖరహరిద్రత్నభాదర్భసందో
హ మజాండాఘాతభగ్నస్యదభవమదతావాప్తలజ్జావనమ్ర
త్వముమై నుత్తానగామర్త్యసురభివదనాంతఃస్థమై లిల నత్యా
ర్థము గోగ్రాసప్రదానవ్రతసుకృతము తోరంబుగా వీటి కిచ్చున్. ||43||

వ. ఇట్టి విచిత్రశోభావైభవంబులకుం బట్టైన యప్పట్టణంబు గలయం గనుంగొని పతంగపుంగవుండు కన్యాంతఃపురప్రదేశంబున నొక్కశృంగారవనంబులోన సఖీమధ్యంబునఁ దారకామధ్యంబున శీతాంశురేఖయుంబోలె నున్నయారాజపుత్త్రిని వీక్షించి యభ్రమండలంబుననుండి విభ్రమభ్రమణరయవికర్ణస్వర్ణమయపర్ణపాళీచ్ఛాయాపటలంబు దిక్కులఁ బిక్కటిల్ల మెఱుంగు మెఱసినచందంబునం గొఱివి ద్రిప్పిన పోల్కి దమయంతీవదనచంద్రబింబంబు సేవింపం బని పూని వచ్చుపరివేషచక్రంబుచాడ్పున వలయాకారంబున నవతరించుచు నాకుంచితపక్షమూలంబును నివేశదేశాతతధూతపక్షంబునుంగా నాక్షణంబ వ్రాలిన. ||44||

## రాజహంస దూత్యము

ఉ*. దుందుభివాద్యనిస్వనముతోఁ దులఁదూగెడు పక్షనాద మం
దంద యతర్కితోపసతమై వినఁబడ్డ విహారలీలలం
జెంది పరాకునన్ మెలఁగు చిత్తము లుద్దవిడిం గలంగఁగా
నిందునిభాస్య లప్పుడు సమీక్షణ చేసిరి రాజహంసమున్. ||45||

వ. అమ్మత్తకాశినులు దమచిత్తంబులు విముక్తతత్తద్విషయగ్రహణంబులై యాహంసంబునందుఁ బరబ్రహ్మంబునందునుం బోలె వర్తించుచుండం జూచుచుండిరి. విదర్భరాజుపట్టి తననెమ్మనంబునఁ బుట్టిన కౌతూహలంబున నమ్మరాళంబుఁ బట్టం

